శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః



# లక్ష్మీగద్యమ్ - సవ్యాఖ్యానం

(శరణాగతిగద్యాంతర్గతమ్)

శ్రీమద్వేదాంతదేశికభాష్యేన సహితమ్

(ఆంధ్రానువాదంతో)



శ్రీరంగనాచ్చియార్, శ్రీరంగం




'పండితరత్న' డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి

అళ్గగ శింగరాచార్యులు

శ్రీమతే రామానుజాయ నమః

భగవద్రామానుజప్రణీతమ్

# లక్ష్మీగద్యమ్

(శరణాగతిగద్యాంతర్గతమ్)

శ్రీమద్వేదాంతదేశికభాష్యేన సహితమ్

(ఆంధ్రానువాదంతో)

వన్దే వేదాన్తకర్పూర చామీకరకరణ్డకమ్ ।
రామా ర్య మార్యాణాం చూడామణి మహర్నిశమ్॥

వేదాంతం అనే కర్పూరాన్ని భద్రంగా సంరక్షించే బంగారు బరిణ వంటివారు, ఆర్యులలో చూడామణివంటివారు అయిన శ్రీరామానుజాచార్యుల వారిని నమస్కరిస్తున్నాను.

★★★★★★★★

మూలం:

భగవన్నారాయణాభిమతానురూప స్వరూపరూపగుణ విభవైశ్వర్య శీలాద్యనవధికాతిశయాసఙ్ఖ్యేయ కల్యాణగుణగణాం, పద్మవనాలయాం, భగవతీం, శ్రియం, దేవీం, నిత్యానపాయినీం, నిరవద్యాం, దేవదేవదివ్య మహిషీమ్, అఖిలజగన్మాతరమ్, అస్మన్మాతరమ్, అశరణ్యశరణ్యామ్, అనన్య శరణ శ్శరణ మహం ప్రపద్యే.

ప్రఖ్యాత శ్రుతివిభవాన్ గురూ నశేషాన్
ప్రశ్రిత్య ప్రణయతి వేఙ్కటేశసూరిః ।

**లక్ష్మీశప్రపదనవైభవప్రతిష్ఠాం**

**రాగాన్ధ్యప్రశమకరీం రహస్యరక్షామ్ ॥**

శ్రీవేంకటనాథులనే ఆచార్యులు, ప్రసిద్ధ శ్రుతివాక్యాలలో చెప్పబడిన మహిమను కలవారైన ఆచార్యుందటిని సేవించి, శ్రీమన్నారాయణుని సన్నిధిలో ప్రపత్తి చేయబడడమనే శరణాగతిలోని వైభవానికి స్థానమైనది, ఆశవల్ల కలిగే గుడ్డితనాన్ని – అంటే– అజ్ఞానాన్ని– పోగొట్టేది అయిన "రహస్యరక్ష" అనే గ్రంథాన్ని రచిస్తున్నారు.

**లక్ష్మీపతే: యతిపతేశ్చ దయైకధామ్నో**

**యో2సౌ పురా సమజనిష్ట జగద్ధితార్థమ్ ।**

**ప్రాప్యం ప్రకాశయతు వ: పరమం రహస్యం**

**సంవాద ఏష శరణాగతిమంత్ర సారః ॥**

కరుణకు అద్వితీయస్థానమైన లక్ష్మీపతికి, శ్రీరామానుజులకు మధ్య పూర్వం ఏ సంవాదం లోకహితంకోసం జరిగిందో. శ్రీశరణాగతికి కరణమంత్రమైన ద్వయమంత్రంయొక్క ముఖ్యార్థరూపమైన సంవాదాన్ని ప్రాప్యమైన, ఉత్తమమైన రహస్యంగా మీకు ప్రకాశింపచేయబడుతున్నది.

**వ్యాఖ్యానం:–** అత్ర భగవాన్ భాష్యకారః సదాచార్యసత్సంప్రదాయా–గతద్వయప్రవచనేన స్వయ నుష్ఠితం న్యాసాఖ్యవిద్యావిశేషం స్వానుబంధి సంజిజీవయిషయా యథావత్ప్ర కాశయన్ "సీతా ముువాచాతియశా రాఘవ ఇ్చ మహావ్రతమ్" "సీతాసమక్షం కాకుత్స్థ మిదం వచనమబ్రవీత్" ఇత్యాది ప్రకారేణ శ్రీప్రపత్తి తదనుగ్రహ పూర్వకం స్వస్య భగవతా2నుజ్ఞాతం స్వయం ప్రయోజనసంవాదవిశేషం నిబధ్నాతి.

**అనువాదం**:- భగవద్భాష్యకారులు సదాచార్యసంప్రదాయంవల్ల లభించిన ద్వయానుసంధానంతో, తమచే అనుష్ఠింపబడిన భరన్యాసమనే విద్యను తమతో సంబంధం కలవారికి కూడా తెలిసి ఉజ్జీవింపజేయాలనే అభిప్రాయంతో దానిని యథాతథంగా ప్రకాశింపజేస్తూ, "సీతా మువాచా2తియశా రాఘవం చ మహావ్రతమ్" (రామా- అయో- 32-2) (గొప్ప కీర్తిని కల లక్ష్మణుడు సీతను ఉద్దేశించి పలికాడు. ఆశ్రితరక్షణమనే గొప్ప వ్రతాన్ని కల శ్రీరామునితో కూడా పలికాడు) ఇత్యాది క్రమంలో లక్ష్మీదేవి సన్నిధిలో ప్రపత్తి చేసి, ఆమె అనుగ్రహాన్ని పురస్కరించుకొని, తమకు భగవానునితో సంభవించిన, స్వయం ప్రయోజనరూపమైన సంవాదాన్ని గ్రంథరూపంగా అనుగ్రహిస్తున్నారు.

**వ్యాఖ్యానం**:- ప్రతివచనాంశ స్తు శరణాగతివశీకృత శరణ్యాభిప్రాయ విశేషోన్నయనేన నిబధ్యత ఇత్యేకే. ఇహ "సంపత్స్యతే" ఇత్యంతం శ్రీమచ్ఛబ్దాభిప్రేత ప్రదర్శనమ్ "అఖిలే"త్యాదికమ్ "అశరణ్యశరణ్య" ఇత్యన్తం నారాయణ శబ్దార్థవివరణమ్. తన్మధ్యే "శ్రీమన్నారాయణ" ఇతి ద్విఃపఠనమ్ — ఉపాయోపేయవాక్యయో స్సిద్ధరూప ప్రధానాంశ వ్యంజనమ్. "అనన్య శరణో2హమ్" ఇత్యుత్తమ పురుషాభిప్రేతాధికారి విశేషోక్తిః, "త్వత్పాదారవిన్దయుగళమ్" ఇత్యాదిక – మప్యర్థత స్స్వరూపత శ్చ మాన్త్రవర్ణిక పదత్రయజ్ఞాపకమ్, ఏవం ప్రధానతమేన సిద్ధోపాయేన సిద్ధ ప్రాప్యేన చ సహ మహావాక్య పర్యవసానభూమితయా శాబ్దప్రాధాన్యవాన్ సాధ్యోపాయాంశో దర్శితః; సాధ్యప్రాప్యమపి "పారమార్థి" కేత్యాదినా సంక్షిప్తమితి జ్ఞాపయితుం మధ్యే ద్వయమితి వాఖ్యేయసమాఖ్యానిర్దేశః.

**అనువాదం:–** ఇందులో కల భగవానుడు బదులు పలికే భాగం, శరణాగతితో వశం చేసికోబడిన శరణ్యుడైన భగవానుని అభిప్రాయవిశేషాన్ని ఊహించి వ్రాయబడిందని కొందఱు అంటారు. ఈ సందర్భంలో "సంపత్స్యతే" అనే పర్యంతం గల భాగం (ద్వయంలో ఉండే) "శ్రీమత్" అనే పదంలోని తాత్పర్యాన్ని నిరూపిస్తున్నది. "అఖిల" అని ఆరంభించి "అశరణ్యశరణ్యామ్" అనే పర్యంతం గల భాగం ద్వయంలోని "నారాయణ" అనే పదంలోని అర్థాన్ని వివరిస్తున్నది. దాని నడుమ "శ్రీమన్నారాయణ" అని రెండు మార్లు పల్కడం అనేది ద్వయంలోని ఉపాయాన్ని, ఉపేయాన్ని తెలిపే పూర్వోత్తరవాక్యాలలోని సిద్ధరూపమైన ప్రధానాంశాన్ని – (లక్ష్మీవిశిష్టుడైన భగవానుని) వ్యక్తం చేస్తున్నది. "అనన్యశరణోऽహమ్" అని ఉత్తమపురుషునితో చెప్పదలచిన విలక్షణుడైన అధికారిపురుషుడు వ్యక్తం చేయబడ్డాడు.

"త్వత్పాదారవిందయుగళమ్" ఇత్యాదులు అర్థంవల్ల, స్వరూపం ద్వారా మంత్రంలో చెప్పబడే మూడు పదాలను జ్ఞాపకం చేస్తున్నవి. ఈ విధంగా మిక్కిలి ముఖ్యమైన, భగవానుడనే సిద్ధోపాయంతో సిద్ధమైన ప్రయోజనంతో పాటు పూర్వోత్తరవాక్యాలు రెండు కలిసి ఒకే మహావాక్యంగా పర్యవసిస్తున్నందున, ద్వయంలో శబ్దత: ప్రాధాన్యాన్ని కల సాధ్యోపాయాంశం చూపబడింది. సాధ్యప్రాప్యం కూడా (పరభక్తి, పరజ్ఞాన, పరమభక్త్యాదులు కూడా) "పారమార్థిక" ఇత్యాదిగా సంక్షేపింపబడిందని తెలుపడం కోసం ఈ గద్యలో వ్యాఖ్యానింపబడే ద్వయమనే మంత్రం పేరు "అత్ర ద్వయమ్" అని నిర్దేశింపబడింది.

**వ్యాఖ్యానం:–** "పితర "మిత్యాదిభిః జితన్తావిశేష భగవద్గీతాదిపఠితై రుక్తసంవాదకై రుపబృంహణగ్రన్థైః ప్రస్తుతోపాయ విశేషపరిగ్రహం శరణ్యస్వభావానుసన్ధానపూర్వకం ప్రాప్యవిరోధినివృత్తి ప్రార్థనాంశశ్చ

ప్రపఞ్చయిష్యమాణద్వయార్థతయా సహేణ సఙ్కలయ్యాహ "మనోవాక్కాయైః" ఇత్యాదిభిః. అర్థక్రమేణ నమశ్శబ్దార్థవివరణ పూర్వకం చతుర్థ్యభిప్రేత పరమపురుషార్థప్రార్థనా ప్రకాశ్యతే. ప్రతివచనవాక్యై స్తు ప్రకృతాధికారినిర్భయత్వాయ స్వీకృత భరస్య శరణ్యస్య స్వాభావికదయార్ద్ర ముత్తరఖండోక్త పరమఫలాంకురకల్ప మభిప్రాయం వ్యవృణుత. అతః కృత్స్న మిదం గద్యం ద్వయవివరణ మితి సాధీయాన్ సమ్ప్రదాయః.

ఇహ చ భగవత్ప్రపదనే సముద్యతస్య సమ్యగ్ జ్ఞానసమ్పాదన పురుషకారపురస్కారాదికం పూర్వకృత్యమ్. సాఙ్గస్వరక్షాభరసమర్పణం తత్కాలకృత్యమ్, స్వనిష్ఠానుసంధానపూర్వకం స్వాధికారోచితకైఙ్కర్య ముత్తరకృత్యమ్. శరణ్యస్య తు పూర్వకృత్యమ్. పురుషకార ప్రరోచనాదికమ్; తత్కాలకృత్యం సమర్పిత సర్వభరస్వీకరణమ్; ఉత్తరకృత్య స్తు స్వయమ్ప్రయోజనభక్త్యాది ప్రదానాన్తిమదశాప్రబోధన– ప్రభృతి పరిపూర్ణకైఙ్కర్య ప్రదానపర్యన్తమ్; ఏతదఖిల మిహ శబ్దతో2ర్థత శ్చ యథాస్థాన మనుసన్ధేయమ్. కిఞ్చ, సంబోధనైః పరం తత్త్వం న్యాసోక్త్యా పరమం హితమ్, ప్రార్థనాభి శ్చ పరమః పుమర్థ ఇహ దర్శితః".

**అనువాదం** :– "పితరమ్" ఇత్యాదిగా– జితంతేస్తోత్రం, భగవద్గీత మొదలైనవానిలో చెప్పడినవి, పూర్వం చెప్పబడిన అర్థాన్ని దృఢీకరించేవి అయిన ఉపబృంహణ వాక్యాలతో పూర్వం ప్రస్తావింపబడిన ఉపాయవిశేషాన్ని తాను పరిగ్రహించడాన్ని, శరణ్యుడైన భగవానుని స్వభావాలను అనుసంధిస్తూ, (తరువాత ద్వయార్థంగా విస్తృతంగా వివరింపబోయే) ప్రాప్యమైన ప్రయోజనానికి ఎదురయ్యే విరోధులను నివృత్తిని చేయాలి"– అనే ప్రార్థనను కూడా సంగ్రహంగా చేర్చి, "మనోవాక్కాయై:" ఇత్యాదిగా చెప్పబడుతున్నది. అర్థక్రమానుసారంగా నమశ్శబ్దార్థవివరణ పూర్వకంగా,

“నారాయణాయ” అనే పదంలోని చతుర్థీ విభక్తిచేత చేయబడే పరమపురుషార్థ రూపమైన భగవత్ కైంకర్యంయొక్క ప్రార్థన వ్యక్తం చేయబడుతున్నది. భగవానుడు సమాధానంగా వాక్యాలతో ఈ గద్యంలో ప్రస్తావింపబడే ప్రపన్నుడైన అధికారి నిర్భయంగా ఉండడం కోసం, అతని రక్షణభారాన్ని స్వీకరించిన శరణుడైన భగవానుని స్వభావం వల్ల కలిగిన దయతో చల్లనిది, ఉత్తరఖండంలో చెప్పబడే పరమపురుషార్థానికి అంకురం అనదగినది అయిన (ఆరంభ రూపమైన) అభిప్రాయాన్ని వివరించారు. అందువల్ల ఈ గద్యం అంతా ద్వయ వివరణమే అనేది అందమైన (చక్కని) సంప్రదాయం.

ఈ విషయంలో, భగవానుని శరణు పొందాలని ప్రయత్నించివానికి– (ఆచార్యులద్వారా) చక్కని జ్ఞానాన్ని సంపాదించడం, (లక్ష్మీ) పురుషకారాన్ని పురస్కరించుకోవడం– అనేవి ముందుగా చేయవలసిన కృత్యాలు. అంగాలతో కూడిన తన రక్షణ, భారసమర్పణమనేది శరణాగతి చేసే సమయంలో ప్రపన్నుడు చేయవలసిన కృత్యాలు. తన నిష్ఠను తెలిసికొని, తన అధికారానికి తగిన కైంకర్యం చేయడమనేది శరణాగతికి అనంతరం అతనిచే చేయవలసిన కృత్యాలు.

శరణ్యుడైన భగవానునకు– పురుషకారంలో ప్రీతిని కల్గించడం మొదలైనవి పూర్వకృత్యాలు. ఇతనిచే సమర్పింపబడిన అన్ని పాపాలను అంగీకరించడం తత్కాలకృత్యాలు. స్వయం ప్రయోజనరూపాలైన భక్త్యాదులను అనుగ్రహించి, అంతిమకాలంలో జ్ఞానాన్ని ఇవ్వడంవరకు ఉండేవి అనంతరకృత్యాలు. ఇవి అన్నీ ఈ గద్యలో ఆ యా పదాలతో, అర్థాలతో ఆ యా సందర్భాలలో అనుసంధేయాలు. ఇంతేకాక,

**“సంబోధనై: పరం తత్త్వం న్యాసోక్త్యా పరమ హితమ్, ప్రార్థనాభి శ్చ పరమః పుమర్థ ఇహ దర్శిత:”**

(ఈ గద్యలో, సంబోధన వాక్యాలతో పరతత్త్వం, శరణాగతి రూప భరన్యాసాన్ని తెలిపే. వాక్యాలతో పరమహితం, ప్రార్థనాపూర్వకమైన వాక్యాలతో పరమపురుషార్థం తెలుపబడ్డాయి.)

**వ్యాఖ్యానం:–** నన్వేవం సకల ఫలప్రదో భగవానేవ తత్ప్రపత్తి సిద్ధ్యర్థమదప్యాశ్రియతామ్, కిమిహ లక్ష్మీప్రపదనేన. మైవమ్; యది భగవత్ప్రపదన మిదానీం శక్యమితి నిశ్చినుయాత్, తదా మోక్షార్థ మేవ తదుపాదదీత; న పున స్తదర్థం తత్ప్రయుఞ్జీత. అనిశ్చితే తు శక్యత్వే నితరామ్; నను చ విదితశ్చేత్ప్రపత్తి శాస్త్రార్థ స్స చ సుకరః, తదా స్వయమేవ మోక్షార్థత్. నుష్ఠీయతామ్; మైవమ్, దుష్కరకర్మాద్యఙ్గ విరహాత్ సౌకర్యే2పి మహావిశ్వాసాద్యఙ్గకప్రపత్తిస్వరూపే, "శ్రూయతే కిల గోవిన్దే" "సత్యం శతేన విఘ్నానామ్" ఇత్యాది న్యాయేన, సమ్భవతి ప్రతిబన్ధే మాత్రయా థౌష్కర్యాత్; ఉక్తఞ్చ– "ఉపాయ స్సుకర స్సో2యం దుష్కర శ్చ మతో మమ" ఇతి. అతః "స్థితే మనసి" ఇత్యాదిప్రక్రియయా విషయత స్స్వరూపత శ్చ విశిష్టాకారప్రపత్త్యనుష్ఠానే ప్రాప్యాభిలాష–ప్రాపకాధ్యవసాయ ప్రాపకాన్తరాన–న్వయానువత్త్యనుగుణ మనస్సమాధానాద్యర్థ మిహ తత్ప్రార్థనం యుక్తమ్.

**అనువాదం:–** ఇక్కడ ఒక సందేహం కలుగవచ్చు. అన్ని పురుషార్థాలను ఇచ్చే భగవానునే ఆ స్వామి సన్నిధిలో చేసే ప్రపత్తి సిద్ధించడంకోసం శ్రీరామానుజులు ఆశ్రయించవచ్చుకదా! లక్ష్మీదేవిని ఆశ్రయించడం. ఎందుకు? – అనేది ఆ సందేహం. ఈ శంక తగినది కాదు. ఎందుకు? అంటే, "ఇపుడు భగవానుని వద్ద ప్రపత్తిని చేయవచ్చు"– అనే నిశ్చయాన్ని కలవాడైతే, అపుడే మోక్షం కోసం ప్రపత్తిని చేయవచ్చు. ప్రపత్తి సిద్ధించడం కోసం

భగవానుని వద్ద ప్రపత్తిని చేయడు. ఆ విధంగా ప్రపత్తి చేయడం సాధ్యమని నిశ్చయించుకోకపోయినా, భగవానుని వద్ద ప్రపత్తిని చేయడు.

అయినా, ప్రపత్తిశాస్త్రార్థాన్ని గూర్చి తెలిస్తే, అది సులభమైనది కనుక, అపుడే తాను మోక్షంకోసం ప్రపత్తిని అనుష్ఠించవచ్చుకదా! – అని అనరాదు. మనకు చేయడానికి సాధ్యం కాని కర్మయోగం మొదలైన అంగాలు లేనందున (ప్రపత్తి) సులభంగా చేయదగినదే అయినా, మహావిశ్వాసం మొదలైన అంగాలను కల దాని స్వరూపం

**"శ్రూయతే కిల గోవిందే భక్తి ముద్వహతాం నృణామ్, సంసారన్యూనతాభీతా: త్రిదశా: పరిపంథిన:"** (విష్ణుధర్మమ్–2–51)
(భగవానుని పట్ల భక్తిని కల మానవులకు తమ సంసారం తక్కువ అవుతున్నదని భయపడే దేవతలు విరోధులు– అంటే– ఆటంకం కల్గిస్తారు– అని వినబడుతున్నది కదా!),

**"సత్యం శతేన విఘ్నానామ్ సహస్రేణ తప స్తథా, విఘ్నాయుతేన గోవిందే నృణాం భక్తి: నివార్యతే"** (విష్ణుధర్మమ్–7–3)
(మానవులకు, నిజం!, వందలాది ఆటంకాలతో అడ్డగింపబడుతున్నది. ఆ విధంగానే తపస్సు, వేలాది విఘ్నాలతో అడ్డగింపబడుతున్న ది, గోవిందుని పట్ల భక్తి పదివేల విఘ్నాలతో అడ్డగింపబడుతున్నది) అని మొదలైన రీతులతో అడ్డంకులు కల్గడానికి అవకాశం ఉన్నది. కనుక, కొంచెం శ్రమపడి నరించదగినది కనుక,

**"ఉపాయ స్సుకర స్సో2యం దుష్కర శ్చ మతో మమ"**

(ఈ ప్రపత్తి అనే ఉపాయం సులభంగా చేయదగినది; కష్టపడి ఆచరించదగినది కూడా– అని నా అభిప్రాయం) (లఘుతంత్రం 17–194) అని చెప్పబడినందున,

**"స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః,**

**ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపం చ మామజమ్"**

(మనస్సు స్వస్థతగా ఉండేటప్పుడు, వాతపిత్త శ్లేష్మాలనే ధాతువులన్నీ సమస్థితిలో ఉన్నపుడు, పుట్టుక లేనివాడను, విశ్వరూపుడను అయిన నన్ను ఎవరు స్మరిస్తారో) ఇత్యాది చోట్ల చెప్పబడినట్లుగా, విషయంచేత, స్వరూపంచేత గొప్పదైన ప్రపత్తిని అనుష్ఠించేటప్పుడు పొందదగిన ప్రయోజనంలోని ఆశ, దానిని పొందించే భగవానునిలో విశ్వాసం, మిగిలిన ఉపాయాలలో మనకు సంబంధం లేదనే భావం అనువర్తించడం– అనే వీనికి అనుగుణమైన నిశ్చయం– అనే ఇవి కల్గడం కోసం ఈ సందర్భంలో లక్ష్మిని ప్రార్థించడం తగినది.

**వ్యాఖ్యానం:–** ఏవమపి సుకృతవిశేషై రేవ లక్ష్మీప్రపత్తివత్, భగవత్ప్రపత్తి రప్యస్తు; మైవమ్. తదర్థ ఏవ హ్యాయం సుకృత విశేషః. న చాత్రాపి పూర్వవదశక్యత్వచోదనా; స్వతంత్రః బుద్ధ్యైవ పూర్వం తావన్మాత్రస్య శక్తి ప్రదానాత్, తదభిప్రాయేణహ్యుక్తం భగవతా శౌనకేన;––

**"వాచః పరం ప్రార్థయితా ప్రపద్యేన్నియతశ్రియమ్"** ఇతి.

శ్రీసాత్వతే చ; –

**"యామాలంబ్య సుఖేనేమం దుస్తరం హి గుణోదధిమ్,**
**నిస్తరన్త్యచిరేణైవ వ్యక్తధ్యానపరాయణాః"** ఇతి.

సాచైవం స్వయ మాహ;––

**"ప్రాయశ్చిత్త ప్రసగే తు సర్వపాపసముద్భవే,**
**మామేకాం దేవదేవస్య మహిషీం శరణం శ్రయేత్"** ఇతి.

న చైవమ్, తదర్థ మపి ప్రపత్త్యన్తరాపేక్షాయా మనవస్థాదిప్రసఙ్గః. స్వతంత్రసఙ్కల్పేన వ్యవస్థితత్వాత్. సామగ్రివిశేషాణాం సామగ్రిప్రవాహోనవస్థా తు, సర్వస్మిన్నపి కార్యే సర్వై స్సిద్ధానిభి స్స్వీకర్తవ్యా, స్వీకృతా చేతి నాసౌ దోషః.

అతో2 పవర్గార్థ భగవత్ప్రపత్తిసిద్ధయే,

**"యజ్ఞవిద్యా మహావిద్యా గుహ్యావిద్యా చ శోభనే,**

**ఆత్మవిద్యా చ దేవి! త్వం విముక్తిఫలదాయినీ",**

**"విద్యాసహాయవన్తం మా మాదిత్యస్థం సనాతనమ్"**

ఇత్యాదిభి స్సర్వవిద్యాప్రవర్తకతయా తత్తద్విద్యాత్వేన నిర్దిష్టాం, సమ్యగ్ జ్ఞానవ్యవసాయోపాయాది ప్రదానే విశేషాధికారవతీ మనుగ్రహైకస్వభావాం, శ్రియ మాథౌ ప్రపద్యతే.

(భగవదితి) అత్ర "అశరణ్యశరణ్యామ్" ఇతి వక్ష్యమాణస్య ఉపయుక్తావిశేషాః నవభిః పదైః ఖ్యాప్యన్తే.

**అనువాదం:–** ఈ విధంగా అయినా, కొన్ని పుణ్యాలవల్లనే లక్ష్మీవద్ద ప్రపత్తి సిద్ధించేటట్లే, భగవానుని వద్దకూడా ప్రపత్తి సిద్ధించడం జరుగవచ్చుకదా! – అని భావించరాదు. ఆ భగవానుని విషయంలో చేసే ప్రపత్తి సిద్ధించడం కోసమే లక్ష్మీవిషయంలో చేసే ఈ ప్రపత్తి– అనే సుకృతం చేయబడుతున్నది. ఈ లక్ష్మీప్రపత్తిలో కూడా, పూర్వంవలెనే, ఇది కూడా చేయడానికి సాధ్యం కాదనే ఆక్షేపం చేయడంకూడా సరి కాదు. స్వతంత్రుడైన భగవానుడు తన సంకల్పంతోనే మొదట లక్ష్మీప్రపత్తిమాత్రం చేయగల్గిన శక్తిని ఇచ్చాడు.

కనుక ఈ అభిప్రాయంతోనే భగవానుడైన శౌనకమహర్షి

**"వాచ: పరం ప్రార్థయితా ప్రపద్యే న్నియతః శ్రియమ్"**

(వాక్కు కంటే గొప్పదైన– వాచామగోచరమైన– పరమపదాన్ని ప్రార్థించేవాడు పరిశుద్ధుడై లక్ష్మీని ఆశ్రయించాలి) (శౌనకసంహిత) అని అన్నారు. శ్రీసాత్వత సంహితలో కూడా–

**"యామాలంబ్య సుఖేనేమం దుస్తరం హి గుణోదధిమ్, నిస్తరంత్యచిరేణైవ వ్యక్తధ్యానపరాయణా:"** (సాత్త్వతసంహిత)

(వ్యక్తమైన భగవానుని రూపాన్ని ధ్యానిస్తూ ఉండేవారు ఏ లక్ష్మిని ఆశ్రయించి, ఎవరికీ దాటరానికి సాధ్యం కాని ఈ సత్త్వరజస్తమోగుణాలనే సముద్రాన్ని శీఘ్రంగా సుఖంగా దాటుతున్నారో) అని చెప్పబడింది. ఆ లక్ష్మియే–

**"ప్రాయశ్చిత్త ప్రసంగే తు సర్వపాపసముద్భవే,**
**మామేకాం దేవదేవస్య మహిషీం శరణం శ్రయేత్"**(లఘుతంత్రమ్–17–20)

(సమస్తపాపాలవల్ల ఏర్పడే ప్రాయశ్చిత్తాన్ని చేయవలసిన ప్రస్తావంలో దేవదేవుడైన భగవానునకు మహిషి అయిన నన్ను ఒక్కతెనే శరణు పొందాలి) అని పల్కింది.

అయితే, ఆ లక్ష్మి విషయంలో చేసే ప్రపత్తిసిద్ధించడం కోసం ఇంకొక ప్రపత్తిని చేయాలి. కనుక, అనవస్థ వస్తుందే! అని సందేహించరాదు. స్వతంత్రుడైన భగవానుని సంకల్పంతో సమగ్రివిశేషాలు అన్నీ ఏర్పడ్డాయి. కనుక, ఆ సందేహానికి తావు లేదు. సామగ్రీపరంపరలో అనవస్థ వస్తుంది. కదా! అనేది అన్ని కార్యాలలోను సిద్ధాంతులందటిచే అవశ్యం అంగీకరించవలసి ఉన్నది. ఆ విధంగానే, ప్రకృతంలో కూడా అంగీకరింపబడింది. అందువల్ల ఈ అనవస్థ అనేది ప్రకృతంలో మాత్రమే ఏర్పడే దోషం కాదు. కనుక మోక్షానికి కారణభూతుడైన భగవానునివద్ద చేసే ప్రపత్తి సిద్ధించడంకోసం

**"యజ్ఞవిద్యా మహావిద్యా గుహ్యావిద్యా చ శోభనే,**
**ఆత్మవిద్యా చ దేవి! త్వం విముక్తఫలదాయినీ"** (విష్ణు పురాణం–1–9–220)

(మంగళస్వరూపిణివి అయిన దేవీ! నీవు యజ్ఞవిద్యవు రాజవిద్యవు, రహస్యమైన విద్యవు, విముక్తి–మోక్షం– అనే ఫలాన్ని ఇచ్చే ఆశ్వవిద్యవు),

**"విద్యాసహాయవంతం మా మాదిత్యస్థం సనాతమ్"** (శాంతి పర్వం--339-66)

(విద్యను సహాయంగా కలవాడునుగా, అంటే, లక్ష్మితో కూడి ఉండేవాడనుగా, సూర్యమండలంలో వేంచేసి ఉండేవాడనుగా. అనాదియైనవాడనుగా ఉండే నన్ను ఉపాసించాలి) ఇత్యాది వాక్యాలలో తత్త్వవాక్యాలలో అన్ని విద్యలను ప్రవర్తింపజేస్తున్నందున తత్త్వవిద్యా స్వరూపిణిగా నిర్దేశింపబడినది,

సమ్యక్ జ్ఞానాన్ని, నిశ్చయం (ప్రయత్నం), ఉపాయం మొదలైనవానిని అనుగ్రహించడంలో విశేషించి అధికారాన్ని కల్గినది, అనుగ్రహాన్ని మాత్రమే స్వరూపంగా కల్గినదై ఉండే లక్ష్మీదేవిని మొదట "భగవన్నారాయణ" ఇత్యాదిగా ఆరంభించి, శరణంగా ఆశ్రయిస్తున్నారు.

(భగవదితి) అని అంటూ. ఈ సందర్భంలో "అశరణ్యశరణ్యామ్" (లక్ష్మీదేవి ఏ దిక్కూ లేనివారికి గొప్ప దిక్కు – అని చెప్పబోయే విషయానికి అనుగుణంగా ఉండే విశేషాలు తొమ్మిది పదాలతో చెప్పబడుతున్నాయి.

**వ్యాఖ్యానం:**– నను, "విష్ణుపత్నీ" "విష్ణువల్లభా" ఇత్యాదిషు భాస్కరేణ ప్రభేవ, పత్యా 2సౌ నిరూప్యతామ్. యథోక్తం తాభ్యా మేవ– "అనన్యా హి మయా సీతా", "అనన్యా రాఘవేణాహమ్" ఇతి. ఇహతు, తయా, తన్నిరూపణేవ్యాఖ్యేయస్థే కిమితి భగవతా2 సౌనిరూప్యతే? ప్రస్తుతోపయోగార్థ మితి బ్రూమః. భగవదభిమతానురూపత్వే హి తస్యా స్తేనేచ్ఛావిఘాతాభావా త్తద్విరుద్ధేచ్ఛావిరహాచ్చ. తతో2స్మదిష్టం సిద్ధ్యేత్. ప్రభయా ప్రభావత ఇవ వ్యాఖ్యేయగతమ్, తయా తస్య నిరూపణమపి శ్రీవల్లభాదివ్యపదేశేన దర్శయిష్యతి.

**అనువాదం:–** అయినా, **"విష్ణుపత్నీ, విష్ణువల్లభా"** ఇత్యాదులలో,

**"అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా"**

(కాంతి సూర్యుని కంటే వేఱు కానట్లు, సీత నా కంటే వేఱు కాదు) ఇత్యాది సందర్భాలలోవలె పతి అయిన భగవానుని పురస్కరించుకొని ఈ లక్ష్మీదేవి నిరూపింపబడుతున్నది. ఆ విధంగానే, పతిపత్నులిద్దఱిచే (సీతారాములిద్దరిచే) **"అనన్యా హి మయాసీతా"** (శ్రీరామా–యుద్ధ–121–20) (సీత నాకంటే వేఱు కాదు) **"అనన్యా రాఘవేణాహమ్"** (శ్రీరామ–సుందర–21–15) (శ్రీరాముని కంటే నేను వేఱు కాదు) అని శ్రీరామాయణంలో చెప్పబడింది. మొదట (ద్వయమంత్రంలో) లక్ష్మిని పురస్కరించుకొని భగవానుని నిరూపించినపుడు, ఇక్కడ మఱి ఏ విధంగా భగవానుని పురస్కరించుకొని ఆమె (లక్ష్మిని) నిరూపించడం జరుగుతున్నది? – అని అంటే, ప్రకృతకార్యానికి (పురుషకారప్రపత్తికి) ఉపయోగపడడంకోసం– అని సమాధానాన్ని పల్కుతున్నాము. లక్ష్మీదేవి స్వరూపం మొదలైనవి భగవానునకు ఇష్టంగా, అనురూపంగా –తగినవిగా – ఉన్నందువల్ల, ఆ భగవానునిచే ఆమె ఇష్టానికి ఆటంకం ఏమీ కల్గదు కదా. ఆమె అభిమతానికి విరోధమైన ఇచ్ఛ అతనికి (భగవానునకు) కలదు.

కనుక, మన ఇష్టం కూడా తప్పక సిద్ధిస్తుంది కదా. కాంతిని పురస్కరించుకొని సూర్యుని నిరూపించేటట్లే, మూలంలో (ద్వయంలో) లక్ష్మిని పురస్కరించుకొని భగవానుని నిరూపించడంకూడా జరిగింది. **"శ్రీవల్లభ"** ఇత్యాదిగా పల్కడం ద్వారాకూడా ఇది ఇకపై రాబోయే గ్రంథంలో చూపబడబోతున్నది కూడా.

**వ్యాఖ్యానం:–** ఇదఞ్చ, పరస్పరనిరూప్యత్వ మన్య త్రాప్యుక్తమ్,

**"తదేతత్సూక్ష్మ మిథునం పరస్పరవిచిన్వితమ్,**

**ఆదా వన్యోన్యమిశ్రత్వా దన్యోన్య ప్రతిపాదకమ్" ఇతి.**

(ఆదా వన్యోన్యమిశ్రత్వాత్) శాన్తానన్తేత్యాది ప్రకారేణ నిత్యమన్యోన్యసమృద్ధత్వాదిత్యర్థః. న చ పరస్పరనిరూప్యత్వే అన్యోన్యాశ్రయదోషః, ప్రభా– ప్రభావతో రివ ప్రమాణతః ప్రకారాన్తరేణాపి తయో ర్నిరూపణాత్.

అత్ర ద్విషట్కాష్టాక్షరగతాభ్యాం భగవన్నారాయణ శబ్దాభ్యామ్ "శుద్ధే మహావిభూత్యాఖ్యే", "నరసమ్బన్ధినో నారాః" ఇత్యాదిభి ర్నిరుక్తాభ్యా ముభయలిఙ్గత్వ ముభయవిభూతిత్వఞ్చ ఖ్యాప్యతే.

**అనువాదం:–** ఈ విధంగా లక్ష్మీదేవిని పురస్కరించుకొని భగవానుని, భగవానుని పురస్కరించుకొని లక్ష్మీదేవిని నిరూపించడం వేఱు సందర్భాలలో కూడా

**"తదేతత్ సూక్ష్మమిథునం పరస్పరవిచిన్వితమ్,**

**ఆదా వన్యోన్యమిశ్రత్వా దన్యోన్యప్రతిపాదకమ్" (పాంచరాత్రమ్)**

(ఈ సూక్ష్మాలైన లక్ష్మీనారాయణులనే) మిథునం, ఒకరికి ఇంకొకరు చిహ్నంగా కల్గినవారై న్నారు. సదా వీరిద్దరు కలసి ఉన్నందున పరస్పరం ప్రతిపాదకులై ఉన్నారు) అని చెప్పబడింది. ఇక్కడ "ఆదా వన్యోన్యశ్రత్యాత్" అనేదానికి " శాంతానంత" ఇత్యాదిగా, యామునులచేత చతుఃశ్లోకి శోకంలో చెప్పబడినది. ఎల్లప్పుడు ఒకరితో ఒకరు కలిసి ఉన్నందున –అని అర్థం ఒకరికొకరు నిరూపకంగా ఉంటే, అన్యోన్యాశ్రయ దోషం వస్తుంది కదా! ని అనరాదు.

కాంతిని, కాంతిని కల వస్తువును వలె, ప్రమాణాలద్వారా వేఱు విధంగా కూడా వారిని నిరూపిస్తున్నందున, ఆ దోపం రాదు. ఈ సందర్భంలో–

**"శుద్దే మహావిభూత్యాభ్యే వాసుదేవే సనాతనే,**

**నిరుపాధీ చ వర్తేతే"** (విష్ణుపు-6-5-72)

(భగవానుడనే శబ్దం, పురుషుడనే శబ్దం గొప్ప విభూతిని కలవాడనే పేరు కల, పరిశుద్ధుడైన, అనాది అయిన వాసుదేవుని విషయంలో స్వభావసిద్ధంగానే ఉన్నాయి- అంటే - అవి ఆ స్వామికి సహజ వాచకాలై ఉన్నాయి) అని,

**"నరసంబంధినో నారా:"** (అహిర్బుధ్న్య-52) (నరుడనే భగవానుని సంబంధాన్ని కల వస్తువులు నారాలు అనబడతాయి).

**"తస్యాయతనం పూర్వం తేన నారాయణ: స్మృత:"**

(ఆ నారానికి ఈ నారాయణుడు పూర్వం ఎందువల్ల స్థానమై ఉన్నాడో, అందువల్ల నారాయణుడనబడుతున్నాడు) ఇత్యాది వచనాలవల్ల వ్యాఖ్యానింపబడిన ద్వాదశాక్షరి, అష్టాక్షరి- అనే వీటిలో ఉండే "భగవత్, నారాయణ:" అనే పదాలతో రెండు విధాలైన చిహ్నాలను- అంటే, ఉభయలింగాలను- కలవాడనేది, రెండు విధాలైన విభూతులను కలవాడనేది తెలుపబడినది.

**వ్యాఖ్యానం:-** భగవచ్ఛబ్దస్య "ఉత్పత్తిం ప్రళయఞ్చైవ" ఇత్యాది ప్రదర్శితక్రమేణ "అన్యత్ర హ్యుపచారతః" ఇత్యౌపచారిక ప్రయోగ ప్రాచుర్యమస్తి. నారాయణశబ్దస్య తు తన్నాస్తి. కారణవాక్యేషు చానన్యథాసిద్ధనిస్సన్దేహవిశేష నిర్ధారణోపయుక్త శ్చాయమ్. "ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మా నేశానః" ఇతి శ్రుతేః! "సహస్రశీర్ష" మిత్యనువాకేనైవ సర్వపరవిద్యావేద్యనిర్ధారణమ్. అత స్తేనాత్ర విశేష్యస్య నిర్దేశః, తత శ్చ తద్విశేషణతయా భగవచ్ఛబ్దో నాత్ర రూఢః, ఉభయ లిఙ్గత్వవ్యక్త్యర్థమివ. ఉక్తప్రకారం భగవత స్స్వరూపం నిరతిశయానన్దతయా ముక్తానాం నిత్యానా మివ చ స్వస్యాప్యభిమతమ్.

**అనువాదం :–** భగవచ్ఛబ్దానికి

**“ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానాం చ గతాగతిమ్”**(–5–78)

(ప్రాణుల పుట్టుక, ప్రళయం, లోకాంతరాలకు వెళ్ళడం, ఇక్కడకు తిరిగి రావడం– అనే వీనిని ఎవడుతెలిసికొంటున్నాడో, అతడుభగవాను డనబడుతున్నాడు) ఇత్యాది సందర్భాలలో చూపబడిన రీతిలో, “అన్యత్ర హ్యుపచారత:” (విష్ణు–పు– 6–5–77) (భగవానునిపట్ల కాక ఇతరుల పట్ల భగవచ్ఛబ్దం ఔపచారికంగా ప్రయోగింపబడుతున్నది) ఇత్యాది ఔపచారిక పద ప్రయోగం ప్రచురంగా– ఎక్కువగా– ఉన్నది. (ఇతరుల విషయంలో కూడా భగవచ్ఛబ్ద ప్రయోగం కన్పిస్తుంది) కాని, నారాయణ శబ్దానికి ఆ విధమైన ఔపచారిక ప్రయోగం లేదు. కారణవాక్యాలలో కూడా వేదొక విధంగా సిద్ధించనిది, సందేహం లేనిది అయిన వస్తువిశేషాన్ని నిశ్చయించడంకోసం “ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మా నేశానః” (మహోపనిషత్) (సృష్టికి పూర్వం నారాయణుడొక్కడే ఉన్నాడు. బ్రహ్మ లేడు, ఈశ్వరుడు లేడు) అనే శ్రుతి వాక్యాదులలో ఈ నారాయణపదం ప్రయోగింపబడింది. “సహస్రశీర్షమ్” (వేయి తలలను కలవానిని) అనే అనువాకంలో ఈ నారాయణశబ్దంతోనే అన్ని పరవిద్యలలో ఉపాసించదగిన వస్తువును నిర్ధారించడం జరిగింది. అందువల్ల, ఆ పదం ద్వారానే ఇక్కడ విశేష్యవస్తునిర్దేశం చేయబడింది. అందుచేత దానికి విశేషణమై ఉండే భగవచ్ఛబ్దం రూఢిశక్తిని అంగీకరించకుండా, రెండు విధాలైన లింగాలను (ఉభయలింగాలను) కలవాడు– అనే విషయాన్ని ప్రకాశింపజేయడంకోసం మాత్రం ప్రయోగింపబడింది. ఇటువంటి భగవానుని స్వరూపం అవధి లేని ఆనందరూపమై ఉన్నందున, నిత్యులకు, ముక్తులకువలె భగవానునకుకూడా అది చాలా ప్రియమైనది.

**వ్యాఖ్యానం:**– తతో2పి స్వవల్లభాయా స్స్వరూపాదిక మిత్యభిప్రాయేణా–భిమతేత్యుక్తమ్. శ్రూయతే హి "**శ్రియం లోకే దేవజుష్టా ముదారామ్**" ఇతి. నిరవధిక క్రీడోపయుక్తతయా దేవేన భగవతా ప్రీతివిషయీకృతా మిత్యర్థః. సాపేక్షనిరపేక్షయో ర్నిరపేక్షే సంప్రతిపత్తేః బాధకస్యా భావాత్, ఔచిత్యాభిశయా త్తథైవ వేదవిద్వ్యాఖ్యాతత్వాచ్చ, దేవశబ్ద2త్ర వాసుదేవపరః; "**దేవై ర్జుష్టా**" మితి తు మన్దమ్. స్మర్యతే చ "**ప్రాణే 2భ్యోపి గరీయసీ**" ఇతి.

**"అస్యా దేవ్యా మన స్తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్,**

**తేనేయం స చ ధర్మాత్మా ముహూర్తమపి జీవతి"** ఇతి చ.

అభిమతత్వే2 ప్యననురూపత్వ మనురూపత్వే2ప్యనభిమతత్వఞ్చ లోకేదృష్టమితి, తద్వ్యవచ్ఛేదార్థ ముభయోక్తిః. యథా "చకర్థ యస్యా భవనం భుజాన్తరమ్" ఇత్యాది శ్లోకయో ర్లోకే కేనచిదాకారేణా2భిమతానురూపత్వ మాకారాన్తరేణ తదభావశ్చ క్వచిదృశ్యతే, తద్వ్యుదాసాయ స్వరూపరూపాదిసర్వోక్తిః. అత్ర తు స్వరూపస్య స్వగుణత్వాయోగాత్, స్వరూపం– రూపం గుణవిభవైశ్వర్యశీలాద్యనవధికా2 తిశయా2సంఖ్యేయ–కల్యాణగుణగణ శ్చేతి ద్వన్ద్వః; అనురూపత్వ– మిహ సమ్బన్ధే సతి ప్రకృష్టం సాదృశ్యమ్; యథా "పరస్పరస్య సదృశౌ ప్రమాణేఙ్గితచేష్టితైః" ఇతి. రత్నకాంచన ముక్తాప్రవాళాదేరివ స్వసమృద్ధేన శోభాతిశయ హేతుత్వరూప మౌచిత్యం వా; యథా–

**"అతీవ రామః శుభే 2తి కామయా**

**విభుః శ్రియా విష్ణురివా మరేశ్వరః"** ఇతి; యథా చ–

**"తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్,**

**రాఘవో2 ర్హతి వైదేహీం తఞ్చేయ మసితేక్షణా"** ఇతి.

అత్ర వయోలక్షణ స్తుల్యశబ్ద ఔచిత్యపరః; దంపత్యో ర్న్యూనాధిక వయస్కత్వాత్. స్త్రీ పుంసలక్షణానాఞ్చ భిన్నప్రకారత్వాత్, తత్సహోక్త్యా శీలాదిష్వప్యౌచిత్యమివ, తుల్యశబ్ద ఉక్తార్థస్యార్థ తీతి సముదాయనిర్దేశాచ్చ.

యద్వా, అర్హత్వస్య సాధకతయా తుల్యశబ్దేన సదృశత్వ ముచ్యతే. వయః సదృశత్వం **"ఘనకనకద్యుతీ యువదశామపి ముగ్ధదశామ్"** ఇత్యుక్తమాసన్నతరత్వమ్. లక్షణస్య సదృశత్వం – పతిలక్షణ–వత్సర్వోత్కర్షవ్యఞ్జకత్వమ్; యేన స పురుషోత్తమః, సా చ **"సర్వలక్షణసమ్పన్నా నారీణా ముత్తమోత్తమా"** ఇత్యుచ్యతే. **"సదా తవైవోచితయా"**, **"ఆహు స్త్వై రనురూప రూపవిభవైః"** ఇత్యాదిక మత్రానుసన్ధేయమ్.

**అనువాదం:**– దానికంటే, తన పత్ని అయిన లక్ష్మీదేవి స్వరూపం మొదలైనవి. మిక్కిలి ప్రియమైనవి– అనే అభిప్రాయంతో **"అభిమత"** అని చెప్పబడింది. శ్రుతిలో కూడా (శ్రీసూక్తంలోకూడా) **"శ్రియం లోకే దేవజుష్టా ముదారామ్"** (శ్రీ సూక్తం) (లోకంలో భగవానునిచే ప్రీతితో సంశ్లేషింపబడినది. ఉదారస్వభావురాలు అయిన లక్ష్మిని) అనే అర్థాన్ని కల వాక్యం అప్పుబడుతున్నది. ఇక్కడ ఈ వాక్యానికి –అవధి లేని తన లీలకు ఉపయోగపడుతున్నందున దేవుడైన భగవానుని చేతన ఆనందానికి విషయంగా చేసికొనబడినది– అని అర్థం. ఇక్కడ దేవపదాన్ని చేర్చి అర్థం పల్కడం. ఆ విధంగా ఏ పదాన్ని చేర్చకుండా అర్థాన్ని పల్కడం– అనే వీనిలో ఇంకొక పదాన్ని అపేక్షించకుండా అర్థాన్ని పల్చడం విశేషం కనుక, దానికి ఏ విధమైన బాధకం లేనందున, ఎక్కువ ఔచిత్యం ఉన్నందున, ఆ విధంగానే వేదంలో ప్రసిద్ధమైనందున, ఇక్కడ శ్రీసూక్షంలో **"దేవ"** అనే పదం వాసుదేవుని తెల్పుతుంది.

దేవతలచే ఆశ్రయింపబడినవాడు– అనే అర్థం ఇక్కడ ప్రయోజనం లేనిది. (మందమైనది) స్మృతులలో కూడా (శ్రీరామాయణంలో కూడా) "**ప్రాణేభ్యోఽపి గరీయసీ**" (శ్రీరామా– అరణ్యా–10–22) (నా ప్రాణాలకంటే సీత మిన్న) అని,

"**అస్యా దేవ్యా మన స్తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్, తేనేయం స చ ధర్మాత్మా ముహూర్తమపి జీవతి**" (శ్రీరామా–సుందర–15–52) (సీతాదేవి మనస్సు శ్రీరామునిలోను, శ్రీరాముని మనస్సు సీతాదేవిలోను నిలచి ఉన్నది, అందువల్లనే ధర్మాత్ముడైన ఆ శ్రీరాముడు క్షణకాలమైనా జీవించగల్గుతున్నాడు) అని చెప్పబడింది.

ప్రియంగా ఉన్నా, అనురూపంగా లేకపోవడం, అనురూపంగా ఉన్నా ప్రియంగా లేకపోవడమనేది లోకంలో కన్పిస్తున్నది కనుక, వీటిని నిషేధించడం కోసం "అభిమత, అనురూప" అనే రెండు పదాలు ప్రయోగింపబడ్డాయి. "చకర్థ యస్యా భవనం భుజాంతరమ్" (స్తోత్రరత్నమ్–37) అనే శ్లోకంలో, దాని తరువాత శ్లోకంలో ఏవిధంగా చెప్పబడిందో, చెప్పబడ్డాయి. ఆ విధంగానే "అభిమత, అనురూప" అనే ఈ రెండు లోకంలో కొన్ని ఆకారాలతో ప్రియంగా, అనురూపంగా ఉండడం, మణి కొన్ని ఆకారాలతో ఆ విధంగా లేకపోవడం అనేది కొన్ని వస్తువులలో కన్పిస్తున్నది. దానిని నిషేధించడంకోసం స్వరూపం, రూపం మొదలైనవి. అన్నీ చెప్పబడ్డాయి. ఈ సందర్భంలో స్వరూపం తన గుణం కానందువల్ల "స్వరూపం, రూపం, విభవం, గుణం, ఐశ్వర్యం, శీలాద్యనవధికాతిశయా– సంఖ్యేయకల్యాణగణః" అనే ద్వంద్వసమాసాన్ని చెప్పాలి. ("స్వరూపం చ, రూపం చ, విభవ శ్చ, గుణా శ్చ, ఐశ్వర్యం చ శీలాద్యనవధికాతిశయా– సంఖ్యేయ కల్యణగుణగణ శ్చ" అని ద్వంద్వం).

అనురూపంగా ఉండడం అంటే– "పరస్పరస్య సదృశౌ ప్రమాణేంగితచేష్టితై:" (శ్రీరామా–బాల–48–5) (కొలత, జాడలు, చేష్టితాలు– అనే వీనిలో సీతారాములు ఒకరినొకరు పోలినవారు) అని చెప్పబడినట్లుగా, ఇక్కడ మిక్కిలి సామ్యాన్ని కల్గి ఉండడమనే అర్థాన్ని గ్రహించాలి. రత్నం, స్వర్ణం, ముత్యం, పగడం– అనే వీనివలె ఒకదానితో ఇంకొకటి చేరినందున అధికమైన శోభ కల్గడానికి కారణమై ఉండే స్వభావమనే ఔచిత్యమని కూడా అనురూపమనే పదానికి అర్థం. ఆ విధంగానే,

**"అతీవ రామ: శుశుభే2తికామయా**

**విభు: శ్రియా విష్ణు రివామరేశ్వర:"** (రామా–బాల–77–33)

(శ్రీరాముడు మిక్కిలి ఆశను కల్గిన ఆ సీతతో ఏ విధంగా ప్రకాశించాడంటే, లక్ష్మితో విభువైన, దేవతలకు ధిపతి అయిన విష్ణువువలె గొప్పగా ప్రకాశించాడు) అని,

**తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్,**

**రాఘవో 2 ర్హతి వైదేహీం తం చేత మసితేక్షణా"**

(రామా–సుందర–16–5)

(శ్రీరామునితో సమమైన శీలం, వయసు, నడవడిక – అనే వీనిని కల్గినది, సమమైన గొప్ప వంశంలో ఉన్న లక్షణాలు– అనేవానిని కల్గినది అయిన సీతకు శ్రీరాముడు తగినవాడు. అతనిని (రాముని) పొందడానికి నల్లని నేత్రాలను కల ఈ సీత తగినది) అని చెప్పబడింది.

ఈ శ్లోకంలో వయస్సు, చిహ్నాలు– అనేవానిని గూర్చి **"తుల్య"** శబ్దం ఉచితమై– తగినవై– ఉన్నవనే అర్థాన్ని ఇస్తుంది. ఎందుకంటే, దంపతులు ఒకరికొకరు హెచ్చు తగ్గులను కల వయస్సుతో కూడినవారై ఉంటారు కనుక. అంతేకాక, స్త్రీలలక్షణాలు, పురుషుల లక్షణాలు వేరు వేరుగా ఉంటాయి కనుక. వాటితో కలిపి చెప్పినందున స్వభావం మొదలైనవానిలో కూడా

"**తుల్య**" అనే పదం ఉచితంగా ఉండడమే తెల్పుతున్నది ఎందుకంటే, "**తుల్య**" అనే పదంతో చెప్పబడిన అర్థం "**అర్హతి**" అని సాముదాయికంగా (కలిపి) చెప్పబడింది కనుక. లేక, "**అర్హతి**" అని పల్కినదానికి సాధకంగా– "తుల్య" అనే పదంతో సమానంగా ఉండడం అనేది చెప్పబడుతున్నదని కూడా చెప్పవచ్చు. వయస్సు సమానంగా ఉండడం అంటే– "**ఘనకనకద్యుతీ యువదశా మపి ముగ్ధదశామ్**" (శ్రీగుణరత్న–35) (మేఘంయొక్క, బంగారం యొక్క, కాంతివంటి కాంతిని, యౌవనదశను, కౌమారదశను కల్గినవారు– లక్ష్మీనారాయణులు) అని చెప్పబడినట్లుగా చాలా దగ్గరగా ఉండడం. లక్షణాలు సమంగా ఉండడం అంటే– భర్తలక్షణాలవలె, అందటి కంటే గొప్పతనాన్ని తెలిపేవిగా ఉండడం– (భగవానుని లక్షణాలు పురుషోత్తమత్వాన్ని తెలిపేటట్లుగా, స్త్రీలలో ఈ, ఉత్తమురాలు– అనే విషయాన్ని తెలిపే లక్షణాలను లక్ష్మి కల్గి ఉండడం) ఏ లక్షణాలతో అతడు పురుషోత్తముడని, ఆమెకూడా

**"సర్వలక్షణసంపన్నా నారీణాముత్తమా వధూ:" (రామా–బాల– 1)**

(సీత అన్ని శుభలక్షణాలను కల్గినది, స్త్రీలలో ఉత్తమురాలు అయిన వధువు) అని చెప్పబడుతున్నది. అటువంటి లక్షణాలను కల్గి ఉండడం.

"**సదా తవైవోచితయా తవ శ్రియా,**" (స్తోత్రరత్నమ్–35) (ఎల్లప్పుడు నీకే తగినదై, నీకు సంపదవలె ఉన్నదైన లక్ష్మితో),

"**ఆహు: స్వై రనురూపరూపవిభవై:**" (చతు:శ్లోకి–4)

(భగవానుని అన్ని రూపాలు నీకు చెందినవి, తగినవి అయిన రూపాలతో, విభవాలతో విశ్లేషం లేకుండా కలసి ఉన్నాయి. లేక, రూపవిభవాలతో చేరి ఉన్నాయి) ఇత్యాదులు ఇక్కడ అనుసంధేయాలు.

**వ్యాఖ్యానం:–** భగవత్స్వరూపాదేవ ఏతత్స్వరూపాదీనాం యథాక్రమ మానురూప్యమూహ్యమ్, తత్ర స్వరూపం స్వామిసాధారణధర్మ నిరూప్యం ధర్మి, తస్యానురూప్యమ్, "**నానయో ర్విద్యతే పరమ్**" ఇత్యాదిషు గ్రాహ్యమ్. రూపం హి, హిరణ్యవర్ణా మిత్యాద్యామ్నాతమ్. తస్యానురూపత్వం హ్యాతిరమణీయత్వ నిత్యత్వా ప్రాకృతత్వాదివిశిష్ట మద్భుతతమత్వమ్, నిత్యైవేత్యుపక్రమ్య, "**విష్ణో ర్దేహా నురూపాం వై కరోత్యేషా 22త్మన స్తనూమ్**" ఇతి చ నిగమితమ్. అత్ర రూపానన్తరో గుణశబ్ద స్సౌన్దర్యాది దివ్యవిగ్రహగుణపరః. "**గుణాద్రూపగుణాచ్చాపి ప్రీతి ర్భూయో2భ్యవర్ధత**" ఇతివద్, విగ్రహగుణానాం స్వరూపగుణానాఞ్చ పృథఙ్నిర్దేశః ప్రీత్యతిశయద్యోతనార్థః.

విభవః. "**ఫణిపతిశ్శయ్యాసనం వాహనమ్**" ఇత్యాదిభి రుక్తం విభూతిద్వయమ్; యథోక్తమ్; 'అస్యా మమ చ శేషం హి విభూతిరుభయాత్మికే' తి. ఉక్తఞ్చ శ్రీరామమిశ్రైః, "**ఉభయాధిష్ఠానఞ్చైకం శేషిత్వమ్**" ఇతి. ఏవం ద్వయో ర్విభవస్యైకత్వే2పి తదానురూప్యవచన మన్యూనానతిరిక్త విభూతిమత్త్వపరమ్. యద్వా, "**అర్థో విష్ణు రియం వాణీ**" త్యాదిభి ర్లౌకికదమ్పతిన్యాయేన విభజ్య నిర్దిష్టో విభూత్యంశః. స్వాసాధారణ విభూణాదికఞ్చవిభవః; "**నిధిః పద్మోనిధి శ్శబ్ధ శ్చతుర్దంతీ గజ స్తథా, కల్యాణ సర్పః పఞ్చస్య శ్శిక్షితో గృహరక్షకః**" ఇత్యాదిపురాణ ప్రసిద్ధ మానురూప్య మిహ యథార్హం గ్రాహ్యమ్.

ఐశ్వర్యేశీలే చాన్వితేనాదిశబ్దేన పరత్వసౌలభ్యాపయిక గుణవర్గద్వయ సంగ్రహః, "**సర్వైశ్వర్యగుణో పేతాం నిత్యాం తద్ధర్మధర్మిణీమ్**" ఇత్యాదిభి రేతత్సిద్ధిః. అత్ర పరస్పరేచ్ఛావిఘాతాభావా దైశ్వర్య మనురూపం, శీలం చ గుహాదిషు రామస్యైవ, త్రిజటాదిషు తస్యాః ప్రసిద్ధమ్. ఏవం

పతిపారార్థ్యయుక్త తదితరసర్వశేషిత్వాన్వితానా మన్యేషా మపి గుణానా మానురూప్యం సుగమమ్.

"**బ్రహ్మేశాది సురవ్రజ స్సదయిత స్త్వద్దాసదాసీగణః**" ఇత్యుక్తేభ్య స్సాతిశయసజ్ఞ్యాతగుణేభ్యో వ్యావృత్త్యర్థ మాహ (అనవధికాతిశయాఽసజ్ఞ్యేయేతి) అనవధికత్వ మిహ స్వాపేక్షయా ఉత్కృష్టావధిరాహిత్యమ్.

**అనువాదం:–** భగవానుని స్వరూపం మొదలైనవానికి లక్ష్మియొక్క స్వరూపాదులతో కల ఆనురూప్యం (అనురూపంగా ఉండే స్థితి) ఊహించదగినది. ఇక్కడ స్వరూపమంటే, తన అసాధారణధర్మాలతో నిరూపించదగిన ధర్మి (జ్ఞానానందరూపమైన ధర్మి). అది అనురూపంగా ఉండడాన్ని "**నానయో ర్విద్యతే పరమ్**" (విష్ణు–పు–1–8–3) (భగవానుడు, లక్ష్మి– అనే ఈ ఇద్దటి కంటే మించినది ఏదీ లేదు) ఇత్యాది ప్రమాణాలవల్ల తెలియాలి. రూపం అనేది– "**హిరణ్యవర్ణామ్**" (శ్రీసూక్తమ్) (లక్ష్మి బంగారురంగును కల్గినది) ఇత్యాది శ్రుతులలో తెలుపబడింది.

అది అనురూపంగా ఉండడమంటే– అతిరమణీయంగా (చాలా అందంగా) ఉండడం, నిత్యంగా ఉండడం, ప్రకృతిసంబంధం లేకుండా ఉండడం– ఇత్యాదులతో కూడినదై చాలా ఆశ్చర్యకరంగా ఉండడం.
శ్రీవిష్ణుపురాణంలో "**నిత్యై వైషా జగన్మాతా**" (1–8–17) (ఈ జగన్మాత నిత్యమైనదియే) అని ఆరంభించి, "**విష్ణోః దేహానురూపాం వై కరోత్యేషాత్మన స్తనూమ్**" (విష్ణువుయొక్క దివ్యదేహానికి అనుగుణంగా తన రూపాన్ని లక్ష్మి మలచుకొంటుంది) అనే పర్యంతం ఈ విషయం తెలుపబడింది. ఇక్కడ రూపానికి తరువాత చెప్పబడిన గుణశబ్దం సౌందర్యం మొదలైన దివ్యమంగళ విగ్రహ గుణాలను తెల్పుతుంది.

**"గుణా ద్రూవగుణాచ్చాపి ప్రీతి ర్భూయో2భ్యవర్ధత"**

**(రామా–బాల–77–27)**

(సీతకు గల స్వరూపగుణాలతో, దివ్యమంగళవిగ్రహగుణాలతో రామునకు ప్రీతి ఎక్కువగా వృద్ధి చెందింది) అనే విధంగా, దివ్యమంగళ విగ్రహగుణాలు, స్వరూపగుణాలు ప్రత్యేకప్రత్యేకంగా పల్కడం అధికమైన ప్రీతిని తెలుపడంకోసం,

**"ఫణిపతి: శయ్యా2సనం వాహనమ్" (చతు:శ్లోకి–1)**

(ఆదిశేషుడు నీకు శయ్యగా, ఆసనంగా ఉన్నాడు. గరుడుడు వాహనం) అని ఆరంభించి చెప్పబడిన రెండు విభూతులు విభవశబ్దానికి అర్థం. ఆ విధంగానే,

**"అస్యా మమ చ శేషం హి విభూతి రుభయాత్మికా" (లఘుతంత్రమ్)**

(నిత్య- లీలారూపాలైన రెండు విధాలైన విభూతులు ఈ లక్ష్మికి, నాకు శేషమై ఉన్నాయి) అని చెప్పబడింది. శ్రీరామమిశ్రులచే కూడా "ఉభయాధిష్ఠానం చైకం శేషిత్వమ్" (షడర్థసంక్షేప:) (శేషిత్వమనేది లక్ష్మి, భగవానుడు -అనే ఇద్దటిని ఆశ్రయంగా కల్గినది. ఇద్దటిలో ఉన్నది) అని చెప్పబడింది.

ఈ విధంగా ఇద్దటి విభూతులు ఒకటే అయినా, అవి అనురూపమని పల్కడంవల్ల లక్ష్మి హెచ్చు తగ్గులను లేని విభూతులను కల్గినది- అని తెలుస్తున్నది. లేక, "అర్థో విష్ణు రియం వాణీ" (విష్ణు–పు– 1–8–28) (ఈ లక్ష్మి శబ్దం. విష్ణువు అర్థం) ఇత్యాది వాక్యాలతో లోకంలో ఉండే దంపతులవలె విభజించి చెపప్పబడి., విభూతుల విభాగం, లక్ష్మీనారాయణులైన తమకు, తమకు చెందిన అసాధారణాలైన భూషణాలు మొదలైనవి ఇక్కడ "విభవ" శబ్దం చేత చెప్పబడ్డాయని చెప్పవచ్చు.

**"నిధి: పద్మో నిధిః శంఖ శ్చతుర్దంతీ గజ స్తథా,**

**కళ్యాణసర్పః పంచాస్యః శిక్షకః గృహరక్షకః"**

(పద్మమనే నిధి. శంఖమనే నిధి, ఆ విధంగానే నాల్గు కాళ్ళను కల ఏనుగు, అయిదు ముఖాలను కల కల్యాణసర్పమనే పాము, శిక్షకుడు– అనేవారు లక్ష్మికి గృహరక్షకులు) ఇత్యాది పురాణవచనాలలో ప్రసిద్ధం. అవి అనురూపంగా ఉండడం అనేదానిని– ఇక్కడ ఆయా వస్తువులకు తగినట్లుగా తెలియాలి.

ఐశ్వర్యం, శీలం – అనే రెండిటిలో అన్వయించే "ఆది" అనే పదం ద్వారా పరత్వం, సౌలభ్యం, వీటికి ఉపయోగపడే రెండు విధాలైన గుణాల ప్రకారాలు చెప్పబడతాయి.

**"సర్వైశ్వర్యగుణోపేతా నిత్యం తద్ధర్మధర్మిణీ"**

(అన్నిటికి ఈశ్వరిగా ఉండే స్థితి అనే గుణాలతో కూడినదై, సదా ఆ భగవానుని స్వభావాలవంటి స్వభావాలను కల్గినదై, లక్ష్మి ఉంటుంది) ఇత్యాది వాక్యాలవల్ల పరత్వ, సౌలభ్యగుణాలకు అనుగుణమైన గుణప్రకారాలను కల్గి ఉండడం సిద్ధిస్తున్నది. ఇక్కడ ఒకరి ఇష్టం ఇంకొకరి ఇష్టానికి అడ్డు కానందున ఐశ్వర్యం అనురూపమనబడింది.

శీలం కూడా, గుహాదుల విషయంలో శ్రీరామునకు వలె, త్రిజట మొదలైనవారి పట్ల ఈ లక్ష్మికి ఉన్నదనేది ప్రసిద్ధం. ఈ విధంగా భర్తకు శేషమై ఉండడంతో కూడిన, ఆ భర్త కంటే అన్యులకు శేషియై ఉండడమనే స్వభావంతోపాటు కూడిన అన్ని గుణాలు అనురూపాలుగా ఉంటాయనేది సులభంగా తెలియదగినది.

**"బ్రహ్మేశాది సురవ్రజః సదయిత స్త్వద్దాసదాసీగణః"(చతుశ్లోకి–1)**

(బ్రహ్మ మొదలైన దేవగణాలు తమ తమ పత్నులతో పాటుగా నీకు దాసదాసీగణాలుగా అవుతున్నారు) అని చెప్పబడినవారికి ఉండే, అవధితో కూడిన గొప్పతనాన్ని కల్గిన పరిమిత సంఖ్యలోని ఉండే గుణాలకంటే లక్ష్మీదేవి

గుణాలకు గల వ్యత్యాసాన్ని తెలుపడంకోసం "అనవధికాతిశయా సంఖ్యేయ" అని అంటున్నారు. అనవధికమై ఉండడమంటే– ఇక్కడ తన గుణాల అవధి కంటే గొప్ప అవధి ఇంకొకరికి లేకుండా ఉండడం.

**వ్యాఖ్యానం:–** నను, భగవత ఏవైశ్వర్యషమనవధికాతిశయమ్; "**త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్**", "**సర్వేశ్వరేశ్వరః**" ఇత్యాదిభి స్తథోక్తేః. "**పుంప్రధానేశ్వరేశ్వరీ**" తి నామత స్త్రీప్రత్యయా2 నుపపత్తేః, శ్రుత్యాదివిరోధాచ్చైచ అన్యథా నేయమ్. పుంప్రధానేశ్వరేశ్వరశబ్దయోః గోబలీవర్ధన్యాయేన విశేషత ఉక్తానాం బ్రహ్మాదీశ్వరాణాఞ్చ భగవానీశ్వరః, తత్పత్నీ ఇయ మితి, "**పుంయోగాదాఖ్యాయా**" మితి వా స్త్రీప్రత్యయోపపత్తిః. పుంప్రధానే స్వశక్త్యైవ నియచ్ఛతి, ఈశ్వర స్తు వాల్లభ్యేనేతి నిర్వాహో విరూపః, క్లిష్టశ్చ. "**ఈశ్వరీంసర్వభూతానామ్**" ఇత్యేతదప్యేతేన గతార్థమితి.

ఆత్రోచ్యతే; యద్యపి నామ్ని తథా నిర్వాహః, తథాపి, శ్రుతౌ న తథా స్యాత్, సర్వభూతానా మితి షష్ఠ్యన్వయవైఘట్యప్రసఙ్గాత్. స్త్రీ ప్రత్యయ స్తు బాహులకేన నేయః. '**అస్యేశానా జగతో విష్ణుపత్నీ**' తి చ మన్త్రాన్తరేణోక్తమ్, తదపి హి తద్విభూతిభూతభూమివిషయత్వా– త్తత్పర్యవసాయ్యేవ. శ్రీవైకుణ్ఠగద్యే చ, శేషాదీనామపి తదాజ్ఞానువిధాయిత్వ ముక్తమ్, "**శేషశేషాశనాది సర్వం పరిజనం భగవతస్తత్తద వస్థోచిత పరిచర్యాయా మాజ్ఞాపయన్త్యే**" తి. ఆహు శ్చ భగవద్యామునాచార్యాః, "**యస్యా స్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభో2పి ప్రభు ర్నాలం మాతు మియత్తయా నిరవధిం నిత్యానుకూలం స్వతః**".

**అనువాదం:–** అయినా, భగవానుని ఐశ్వర్యమే తన కంటే మించిన, ఇంకొక ఎల్లను లేనిది. ఎందుకంటే– "త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్"

(ఈశ్వరులకు గొప్ప ఈశ్వరుడైన అతనిని) అనే అర్థాన్ని కల శ్రుతివాక్యంతోను, **"సర్వేశ్వరేశ్వర: కృష్ణ:"** (శ్రీకృష్ణుడు ఈశ్వరులందటికి ఈశ్వరుడు) అనే వచనంతోను,

**"న త్వ త్సమశ్చాభ్యధిక శ్చ దృశ్యతే"**

(నీకు సాటి అయినవాడు, మేటి అయినవాడు గోచరించడు),

**"న త్వత్సమో2స్త్యభ్యధిక:కుతోన్యః? "** (గీత–11–45)

(నీకు సమానుడే లేనపుడు, ఇక అధికుడు ఎక్కడ ఉంటాడు?) ఇత్యాది వచనాలతో భగవానుని ఐశ్వర్యం సాటి లేనిదని చెప్పబడినది కనుక, **"పుంప్రధానేశ్వరేశ్వరీ"** (జీవ– ప్రకృతులకు ఈశ్వరుడైన భగవానునకు లక్ష్మి యజమానురాలు) అనే లక్ష్మి నామంలో స్త్రీలింగానికి ఆవశ్యకమైన ప్రత్యయం పొసగనందున, పూర్వం పల్కిన శ్రుత్యాదులకు విరుద్ధంగా ఉన్నందున వేఱు విధంగా అర్థాన్ని చెప్పాలి.

అంటే– జీవాత్మ, ప్రకృతి– అనే వీటికి, గోబలీవర్ధన్యాయంలో విశేషించి ప్రత్యేకంగా చెప్పబడిన బ్రహ్మ మొదలైన ఈశ్వరులకు కూడా భగవానుడు ఈశ్వరుడు, అతనికి ఈమె పత్ని– అనే అర్థం చెప్పాలి. అపుడు **"పుంయోగా దాఖ్యాయామ్"** (పేరులో పురుషుని పేరును చేర్చినందున పేరు చివర ఈ కారం వస్తుంది) అని చెప్పబడిన స్త్రీలింగ ప్రత్యయం పొసగుతుంది. జీవాత్మను, ప్రకృతిని లక్ష్మి తన శక్తితో నియమిస్తుంది. భగవానుని వాల్లభ్యంతో (ప్రేమతో) నియమిస్తుంది– అనే నిర్వాహం వ్యత్యాసం. కల్గినదిగా, శ్రమపడి నిర్వహించ వలసినదిగా ఉంటుంది. **"ఈశ్వరీం సర్వభూతానామ్"** (శ్రీసూక్తమ్) (అన్ని ప్రాణులకు లక్ష్మి ఈశ్వరి) అనే శ్రుతివాక్యం కూడా దీనివల్ల గతార్ధమవుతుంది– అని కొందఱు ఆక్షేపిస్తారు.

దీనికి సమాధానం ఈ విధంగా చెప్పబడుతున్నది. **"పుంప్రధానేశ్వరేశ్వరీ"** అనే లక్ష్మినామంలో పూర్వం పల్కినట్లుగా అర్థం

నిర్వహించినా, "**ఈశ్వరీం సర్వభూతానామ్**" అనే శ్రుతివాక్యంలో ఆ విధంగా పల్కడం వీలు కాదు. ఎందుకంటే- ప్రాణులందరికి –అనే అర్థాన్ని కల షష్ఠీవిభక్తిని కల్గిన పదానికి అర్థం పొసగదు కనుక. (దీని భావమేమంటే- సమస్త భూతాలకు ఈశ్వరుడు. భగవానుడు, అతని పత్ని- అనే అర్థాన్ని శ్రుతివాక్యానికి గ్రహించాలి. ఈశ్వరుని పత్ని- అనే అర్థాన్ని గల ఒక పదంలోని ఏకదేశమైన ఈశ్వరుడనే పదంలో సమస్తభూతాలకు "**సర్వభూతానామ్**" అనే అర్థాన్ని కల షష్ఠీవిభక్తి అన్వయించదు- అని భావం) స్త్రీలింగప్రత్యయమైతే ఈ విధంగా కూడా రావచ్చు- అనే పక్షంలో అర్థం గ్రహించాలి.

"**అస్యేశానా జగతో విష్ణుపత్నీ**" (విష్ణుపత్ని అయిన లక్ష్మి ఈ జగత్తుకు ఈశ్వరి) అనే శ్రుతివాక్యంలో కూడా లక్ష్మి జగత్తుకు ఈశ్వరిగా చెప్పబడింది. ఆ మంత్రంలో కూడా ఆ లక్ష్మియొక్క విభూతి అయిన భూమిని భగవానుడు ఈశ్వరుడు, అతనికి ఈమె పత్ని- అనే అర్థాన్ని చెప్పాలి. అపుడు "**పుంయోగాదాఖ్యాయామ్**" (పేరులో పురుషుని పేరును చేర్చినందున పేరు చివర ఈ కారం వస్తుంది) అని చెప్పబడిన స్త్రీలింగ ప్రత్యయం పొసగుతుంది. జీవాత్మను, ప్రకృతిని లక్ష్మి తన శక్తితో నియమిస్తుంది. భగవానుని వాల్లభ్యంతో (ప్రేమతో) నియమిస్తుంది- అనే నిర్వాహం వ్యత్యాసం. కల్గినదిగా, శ్రమపడి నిర్వహించ వలసినదిగా ఉంటుంది. "**ఈశ్వరీం సర్వభూతానామ్**" (శ్రీసూక్తమ్) (అన్ని ప్రాణులకు లక్ష్మి ఈశ్వరి) అనే శ్రుతివాక్యం కూడా దీనివల్ల గతార్థమవుతుంది- అని కొందరు ఆక్షేపిస్తారు.

**వ్యాఖ్యానం:**- వేదార్థసంగ్రహేచోక్తం – "**స్వాభిమత స్వానురూప స్వరూప రూప గుణ విభవైశ్వర్యశీలాద్యనవధిక మహిమమహిషీ**" ఇతి. ఉక్తం చ శ్రీవత్సాఙ్కమిశ్రైః, "దేవి! త్వన్మహిమావధి ర్న హరిణా నాఽపి త్వయా

జ్ఞాయతే" ఇతి. తదాత్మజై శ్చ, 'ప్రశకనబలే' త్యారభ్య, **"తవ భగవత శ్చైతే సాధారణా గుణరాశయః"** ఇతి.

న చైతావతా భగవతో నిస్సమాభ్యధికత్వవిరోధః, ప్రత్యుత, తత్ప్రతిష్ఠాపనమేవ, **"హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ"** ఇతి శ్రుతేః.

న హ్యేవం విధిపత్నీవిశిష్టత్వం కస్యచిత్తదన్యస్యాస్తి, యేన తత్సామ్యాదిశఙ్కా స్యాత్. ఉపబృంహితఞ్చ **"అప్రమేయం హి తత్తేజో యస్య సా జనకాత్మజా"** ఇతి. ఏవ మస్యా శ్శీలాదీనా మనవధికాతిశయత్వే2ప్యవిరోధః, **"యథా ప్రభాగుణోత్కర్షే భాస్కరో నిస్సమాధికః, శ్రీమానపి తథైవస్యా త్పతిః పత్నీగుణోన్నతౌ, జ్ఞానభోగసమానత్వే నిత్యము క్తేశ్వరేషు చ, యథా సవైషమ్యనియతి స్తథైవాత్రేత్యనావిలమ్"**. శాస్త్రేషు బహుధా భగవద్గుణత్వాదిరూపేణ నిర్దిష్టాయా స్తస్యాః, కైశ్చిన్నిర్గుణత్వాదికం శఙ్క్యత ఇతి, తన్ని రాసాయ కల్యాణగుణోక్తిః. గుణత్వాదినిర్దేశా స్త్వస్యా ద్రవ్యత్వాద్య విరోధేన అన్యపరా ఇతి తత్ర తత్ర ద్రష్టవ్యమ్. **"తతో2వలోకితా దేవాః"** **"త్వయా2వలోకితా స్సద్యః"**, **"స శ్లాఘ్య స్స గుణీ ధన్యః"** ఇత్యాదిభి రేతదవలోకనాత్, క్షుద్రాణా మపి గుణసిద్ధా, సర్వకల్యాణగుణశాలిత్వ మస్యాః కైముత్య సిద్ధమ్. కల్యాణత్వం మోక్షపర్యవసాయి, తత్త్వజ్ఞానాది మఙ్గలావహత్వం. స్వయం నిత్యానుకూలత్వఞ్చ. **"న తే వర్ణయితుం శక్తా గుణాన్ జిహ్వా2పి వేధసః"** ఇత్యాద్యభిప్రేత సర్వాపరిచ్ఛేద్యగుణానన్త్యాతిశయసూచనాయ గణశబ్దః, ఐశ్వర్యాదే రనేకావాన్తరగుణసముదాయాత్మకత్వాద్వా, **"ప్రకృష్టం విజ్ఞాన"** మిత్యాదిన్యాయాత్.

అథ విభూతితో2పి మఙ్గళనిర్వాహకత్వం ప్రదర్శయతి (పద్మవనాలయామితి). ఏతేన **"పద్మే 2స్థితాం పద్మవర్ణామ్"** **"గన్ధద్వారామ్"** ఇత్యాద్యామ్నాత సౌవర్ణ్య సౌగంధ్యాతిశయో2పి సూచితాః.

తచ్ఛరణవరణమంత్రే చోక్తమ్, "**తాం పద్మనేమీం శరణ మహం ప్రపద్యే**" ఇతి. నాభిస్థానీయకర్ణికావస్థానా త్పద్మ మస్యాః నేమివద్భవతి,

"పద్మ మేవ నేమిః, నయనసాధనం, యస్యా స్సా పద్మనేమి" రితి కేచిత్: "**మాతరం పద్మమాలినీమ్**", "**ఆర్ద్రాం పుష్కరిణీం యష్టిం పిఙ్గలాంపద్మమాలినీమ్**" "**శ్రీనిలయమాలాధారిణీ**", "**ప్రియాణి తస్యాః పుష్పాణి కమలాని విదు ర్బుధాః**", "**వికాసి కమలస్థితా**" ఇత్యాదిష్వప్యస్యా విశేషతః పద్మాధికారశ్రుతేః. శ్రీవిష్ణుస్మృత్యాదిషు విస్తరేణోక్తానాం మాఙ్గల్యవిభూతి భేదానా మియం విశేషతో దేవతేతి జ్ఞాపయితు మిహ సుప్రసిద్ధ ముఖ్యమఙ్గళభూత పద్మవనోదాహరణమ్. "**యత్ర పద్మవనాని**" చేతి భగవతో విశేషసన్నిధిస్థానే పద్మవనే తద్విగ్రహ. ఇవ, విశేషేణాసౌ సన్నిధత్తే. ఏతేన "**సా2హం వై పఙ్కజే జాతా సూర్యరశ్మి ప్రబోధితే, భూత్యర్థం సర్వభూతానాం పద్మాశ్రీః వద్మమాలినీ**" ఇతి శ్రీవాసవసంవాదోక్తం సర్వభూతోజ్జీవనార్థావతారసౌలభ్య మపి ప్రదర్శితం భవతి.

**అనువాదం:–** వేదార్థసంగ్రహమనే గ్రంథంలో కూడా శ్రీరామానుజులు "**స్వాభిమత స్వానురూపస్వరూప రూపగుణ విభవైశ్వర్య శీలాద్య–నవధికమహిమా మహిషీ**"

(తనకు ఇష్టమైన, తనకు తగిన స్వరూపాన్ని రూపాన్ని, గుణాలను, విభూతిని, ఐశ్వర్యాన్ని, శీలం మొదలైనవానితో అవధి లేని గొప్పతనాన్ని కల మహిషి –లక్ష్మి) అని అన్నారు. శ్రీవత్సాంకమిశ్రులు కూడా

"దేవి త్వన్మహిమావధి: న హరిణా నా2పి త్వయా జ్ఞాయతే"

(శ్రీస్తవం–8)

(లక్ష్మీదేవీ! నీ మహిమయొక్క అవధిని హరి కాని, నీవు కాని తెలియలేరు) అని అన్నారు. వీరి కుమారులైన భట్టర్ కూడా శ్రీగుణరత్నకోశమనే స్తోత్రంలో "ప్రశకనబల" (32) అని ఆరంభించి,

**"తవ భగవత శ్చైతే సాధారణా గుణరాశయః"**

(ఈ గుణసమూహాలు అన్నీ నీకు, భగవానునకు సమానంగా ఉండేవి) అని అన్నారు.

అయితే, దీనివల్ల భగవానుడు తనకు సమానమైనవారు. మించినవారు ఎవరూ లేనివాడు– అనేదానికి విరోధం వస్తుంది కదా! అని ఆక్షేపించడం సరి కాదు. ఎందుకంటే – లక్ష్మీదేవికి గల నిరతిశయవైభవం భగవానుని నిరతిశయమహిమనే స్థాపిస్తుంది. ఎందుకంటే– "హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ" (యజురారణ్యకం–3) (భూదేవి, లక్ష్మీదేవి నీకు పత్నులు) అనే శ్రుతివాక్యం ఉన్నదికదా! అటువంటి పత్నిని కలవాడై ఉండడం అనేది భగవానునకు తప్ప వేరొకరికి లేదుకదా! ! అటువంటివాడొకడు ఉంటే కదా, "భగవానునకు అతడు సమానుడు" అనే అక్షేపం ఏర్పడుతుంది,

ఇది "**అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా**" (రామా–ఆర–37–18) (సీతాదేవి ఎవరికి చెందినదో, ఆ శ్రీరాముని తేజస్సు అలవికానిది) అనే వేదోపబృంహణ రూపమైన శ్రీరామాయణంలోని సూక్తిద్వారా భగవానుని అప్రమేయమహిమకు లక్ష్మీసంబంధం కారణమనేది వివరింపబడింది. కనుక ఇక్కడ భగవద్వైభవానికి లోటు వస్తుందనే విరోధం లేనేలేదు.

ఈ రీతిలోనే, ఈ లక్ష్మీదేవియొక్క శీలాదిగుణాల అనవధికమైన మహిమకుకూడా ఏ విరోధం లేదు.

**"యథా ప్రభాగుణోత్కర్షే భాస్కరో నిస్సమాధికః,**
**శ్రీమానసపి తథైవ స్యాత్ పతిః పత్నీగుణోన్నతౌ,**

**జ్ఞానభోగ సమానత్వే నిత్యముక్తేశ్వరేషు చ,**
**యదా వైషమ్యనియతి: తథైవాత్రేత్యనావిలమ్"**

(కాంతికి గల గుణాతిశయంవల్ల సూర్యుడు ఏ విధంగా తనతో సమానమైన, అధికుడైనవానిని ఇంకొకనిని కల్గి ఉండదో, ఆ విధంగా, శ్రియ:పతి అయిన పతికూడా పత్ని అయిన లక్ష్మియొక్క గుణాతిశయంవల్ల నిస్సమాధికుడవుతున్నాడు. నిత్యులకు, ముక్తులకు, ఈశ్వరునకు మధ్య జ్ఞానం, భోగం– అనే విషయంలో సమానత్వం ఉన్నా, వారి మధ్య ఏ విధంగా తేడా ఉన్నదో, ఆ విధంగా, ఇక్కడ లక్ష్మి, భగవానుల విషయంలో కూడా లేడా అనేది ఉండడంలో ఏ దోషం లేదు) కనుక, భగవానుని నిస్సమాభ్యధికమైన అతిశయానికి లక్ష్మీదేవికి గల నిస్సమాధికాతిశయం వల్ల ఏ దోషం రాదు.

శాస్త్రాలలో అనేకవిధంగా భగవానునకు గుణస్థానీయురాలనే రూపంగా నిర్దేశింపబడిన లక్ష్మీదేవికి (గుణానికి వేరొక గుణం ఉండదనే క్రమంలో) గుణాలు ఏమీ లేవు– అని కొందఱు సందేహపడవచ్చు– అని తలచి, దానిని తొలగించడంకోసం ఇక్కడ "**కల్యాణగుణగణ**" శబ్దప్రయోగం చేయబడింది. లక్ష్మి భగవానునకు గుణస్థానీయురాలు –అని నిర్దేశించే సూక్తులు అయితే, ఈమె ద్రవ్యమనేదానికి విరోధం లేకుండా ఉండే రీతిలో వాటిని అన్యపరాలుగా ఆ యా నందర్భాలను అనుసరించి సమన్వయించుకోవాలి. "**తతో2వలోకితా దేవా:**" (విష్ణు. పు–1–9–106) (తర్వాత, లక్ష్మీదేవిచే కటాక్షింపబడిన దేవతలు తమ తమ ఐశ్వర్యాలను పొందారు), "**త్వయా2వలోకిత స్సద్య:**" (విష్ణు పు–1–9–130) (నీచే కటాక్షింపబడినవాడై, వెంటనే తన పదవిని పొందాడు), "**స శ్లాఘ్య: స గుణీ ధన్య:**" (విష్ణు. పు. –1–9–131) (లక్ష్మీకటాక్షాన్ని పొందిన అతడు గొప్పవాడు, గుణాలను కలవాడు, ధన్యుడు అవుతున్నాడు) ఇత్యాదివచనాలతో ఈ లక్ష్మీకటాక్షంతో అల్ప ప్రాణులకు కూడా గుణాలు

కల్గినపుడు, ఈమె అన్ని కల్యాణగుణాలను కల్గినది– అనేది కింపునర్న్యాయసిద్ధం కదా! ఈ గుణాల కల్యాణత్వమంటే– మోక్షం వరకు పర్యవసించే తత్త్వజ్ఞానం, మొదలైన శుభాలను కల్గించే స్వభావం, "**వర్ణయితుం శక్తా గుణాన్ జిహ్వా2పి వేధసః**" (నీ గుణాలను వర్ణించడానికి బ్రహ్మనాలుకకు కూడా శక్తి లేదు) ఇత్యాది సూక్తులచే చెప్పబడే, లక్ష్మిగుణాల సంఖ్య పరిచ్ఛేదించి పలుకదానికి ఎవరికీ సాధ్యం కాదనే విషయాన్ని సూచించడంకోసం ఇక్కడ గణశబ్దప్రయోగం చేయబడింది.

లేక, ఐశ్వర్యాదిగుణాలలోని అనేక అవాంతర గుణసముదాయాన్ని తెలుపడం కోసం ఈ గణశబ్ద ప్రయోగం చేయబడిందని కూడా చెప్పవచ్చు. "**ప్రకృష్టం విజ్ఞానమ్**" (వరదరాజస్తవం–15) ఇత్యాది వచనాలలో ఐశ్వర్యాదులైన ఆఱు గుణాలనుండి అనేక అవాంతరగుణాలు ఉద్భవిస్తాయని చెప్పబడిన రీతిని బట్టి ఈ పదప్రయోగాన్ని సమన్వయించాలి.

ఇక, విభూతిద్వారా కూడా లక్ష్మీదేవి మంగళాన్ని నిర్వహించే స్వభావాన్ని "**పద్మవనాలయామ్**" అని అంటూ తెల్పుతున్నారు. ఈ ప్రయోగంద్వారా– తామరపూవులో నివసించేది, తామరపూవు వర్ణంవంటి వర్ణాన్ని కల్గినది ("**పద్మే స్థితాం పద్మవర్ణామ్**" –శ్రీసూక్తమ్) అని, "**గంధద్వారామ్**" (శ్రీసూక్తమ్) (సువాసనను తనను గుర్తించే చిహ్నంగా కల్గినది, లక్ష్మి) అని మొదలైన శ్రుతివాక్యాలలో చెప్పబడిన సౌవర్ణం (మంచి వర్ణం– బంగారువర్ణం), సౌగంధ్యం (మంచి గంధం) — అనే వీని అతిశయం. సూచింపబడింది. ఇది, శ్రీసూక్తంలోని ఆ లక్ష్మిని శరణాగతి చేయడానికి కరణమంత్రమైన వాక్యంలో కూడా– "**తాం పద్మనేమీం శరణ మహం ప్రపద్యే**" (తామరపూవు మధ్యలో ఉండే ఆ లక్ష్మిని నేను శరణు పొందుతున్నాను) అనే వాక్యంలో కూడా చెప్పబడింది.

ఆ మంత్రంలో "తామరపూవుకు నాభిగా చెప్పదగిన కర్ణికలో ఉన్నందున తామరపూలు లక్ష్మికి చుట్టూ ఉన్నందున, పద్మం ఈ లక్ష్మికి నేమివంటిది"– అని చెప్పబడింది.

కొందరు పద్మాన్నే నేమిగా– నయనసాధనంగా, ఆహ్వానించడానికి సాధనంగా– కల్గినది కనుక, లక్ష్మి **"పద్మనేమి"** అనబడుతున్నదని వివరించారు. **"మాతరం పద్మమాలినీమ్"** (లక్ష్మి లోకానికి తల్లి, తామరపూల మాలికను ధరించినది) (శ్రీసూక్తమ్) "అర్ద్రాం పుష్కరిణీం యష్టిం పింగళాం పద్మమాలినీమ్" (శ్రీసూక్తమ్) (దయతో చల్లని స్వభావాన్ని కల్గినది, తామరపూల మాలికను ధరించినది, లోకానికి పుష్టిని ఇచ్చేది, పసుపుపచ్చని వర్ణాన్ని కల్గినది) ఇత్యాది శ్రుతివాక్యాలలో, **"శ్రీనిలయమాలాధారిణీ"** (లఘుతంత్రమ్) (లక్ష్మికి నివాసస్థానమైన తామరపూల మాలికను ధరించేది)

**"ప్రియాణి తస్యా: పుష్పాణి కమలాని విదు ర్బుధా:"**

(ఆ లక్ష్మికి కమల పుష్పాలు (తామరపూలు) ఇష్టమైనవి– అని పండితులు తెలిసికొంటున్నారు), **"వికాసికమలస్థితా"** (విష్ణు–పు– 2–9–100) (వికసించే తామరపూవులో ఉండేది) ఇత్యాది వచనాలలో ఈమె విశేషించి తామరపూవును నివాసంగా అంగీకరించినది– అని చెప్పబడుతున్నది. **"శ్రీవిష్ణుస్మృతి"** మొదలైనవానిలో విస్తృతంగా ప్రతిపాదింపబడిన, మంగళకరాలైన విభూతులకు ఈ లక్ష్మీదేవి విశేషమైన దేవత– అని తెలుపడం కోసం ఇక్కడ చాలా ప్రసిద్ధమైన, ప్రధానమైన, మంగళంగా ఉండే తామరపూలవనాన్ని చెప్పడం జరిగింది. **"యత్ర పద్మవనాని చ"** (ఎక్కడ తామరపూల వనాలున్నాయో) అని భగవానుడు విశేషంగా సాన్నిధ్యాన్ని కల్గి ఉండే చోటయిన తామరపూల వనంలో, అతని దివ్యమంగళవిగ్రహంలో వలె ఈ లక్ష్మి అధికమైన సాన్నిధ్యాన్ని కల్గి ఉంటుంది– అని అన్నాడు. ఇందువల్ల,

**“సా2హం వై పంకజే జాతా సూర్యరశ్మి ప్రబోధితే,**
**భూత్యర్థం సర్వభూతానాం పద్మాశ్రీ: పద్మమాలినీ”**

(అటువంటి నేను భూత్యంచే కాంతిచే వికసింపజేయబడిన తామరపూవులో పద్మ అని, శ్రీ అని, పద్మమాలిని– అని పేరుగల దాననై, అన్ని ప్రాణుల క్షేమం కోసం జన్మించాను) అని శ్రీవాసవసంవాదంలో చెప్పబడిన, ప్రాణులనందటిని ఉజ్జీవించేటట్లు చేయడంకోసం అవతరించిన సౌలభ్యంకూడా ఇక్కడ చెప్పబడింది.

**వ్యాఖ్యానం:–** ఏవం మంగలగుణవిభూతియోగేన నిర్దోషత్వమఫపి సజ్కలయ్యాహ (భగవతీమితి). జ్ఞానశక్తిబలేత్యారభ్య, 'వినా హేయై ర్గుణాదిభి' రితి స్మర్యతే. అథోక్తవక్ష్యమాణ సర్వాతిశయస్థాపికయా సుప్రసిద్ధ స్వాసాధారణసమాఖ్యయా సర్వసమాశ్రయణీయత్వాదికమాహ(శ్రియమితి). ఏవంహి శ్రీశబ్దో నిరుచ్యతే;– **“శ్రీణాతి నిఖిలాన్ దోషాన్, శ్రీణాతి చ గుణై ర్జగత్, శ్రీయతే చాఖిలై ర్నిత్యం, శ్రయతే చ పరమ్పదమ్”** ఇతి. **“శ్రయన్తీం శ్రీయమాణాఞ్చ శృణన్తీం శృణ్వతీ మపి”** ఇతి చ. అస్య చ నామ్న స్సర్వప్రకారోత్కర్ష జ్ఞాపకత్వమాహుః – **“శ్రీ రిత్యేవ చ నామ తే భగవతి! బ్రూముః కథం త్వాం వయమ్”** ఇతి, **“శ్రీరసి యతః”** ఇతి చ, భగవన్నారాయణ పదోక్తస్యానురూప్యఞ్చ **'భగవతీం'**, **'శ్రియ'** మితి పదాభ్యాం దర్శితమ్. శ్రీపదనిరుక్తిభి స్సంశ్రితదోషనిరాకరణమ్, ప్రాప్యరుచి ప్రాపకాధ్యవసాయాదిప్రదానమ్, ఉపాయ స్వరూపనిర్వర్తకత్వమ్, **“పితేవ త్వత్ప్రేయాన్”** ఇత్యాద్యుక్తం, పతిప్రసాదజనకత్వఞ్చ సిద్ధమ్.

**అనువాదం:–** ఈ విధంగానే, “మంగళకరాలైన గుణాలు, విభూతులు”– అనే వీటిని కల్గి ఉండడం వల్ల “లక్ష్మీదేవి ఏ దోషం లేనిది” అనేదానిని కూడా కలిపి

**"భగవతీమ్"** అని అంటూ పల్కుతున్నారు– **"జ్ఞానశక్తిబలైశ్వర్య"** అని ఆరంభించి, **"వినా హేయై ర్గుణాదిభి:"** (విష్ణు–పు– 6–5–19) (హేయగుణాలు లేని, జ్ఞానం, శక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు– అనే గుణాలు అన్నీ భగవచ్ఛబ్దంచేత చెప్పబడతాయి) అనికదా స్మృతిలో (విష్ణుపురాణంలో) భగవచ్ఛబ్దం తెలుపబడింది. ఇంతవరకు పల్కిన, ఇక చెప్పబడే లక్ష్మియొక్క అతిశయాన్ని అంతటిని నిరూపించే, చాలా ప్రసిద్ధమైన, లక్ష్మికి అసాధారణమైన తిరునామంతో "అందటికి ఆశ్రయించదగినది" ఇత్యాది విషయాలను **"శ్రియమ్"** అని అంటూ పల్కుతున్నారు.

శ్రీశబ్దం ఈ క్రింది విధంగాకదా నిర్వచింపబడుతున్నది.

**"శృణాతి నిఖిలాన్ దోషాన్ శ్రీణాతి చ గుణైర్జగత్,**
**శ్రీయతే చాఖిలై ర్నిత్యం శ్రయతే చ పరం పదమ్"**

**(అహిర్బుధ్న్యసంహిత–51)**

(లక్ష్మి, ఆశ్రితుల దోషాలను అన్నిటిని పోగొడుతున్నది, గుణాలతో లోకాన్ని వ్యాపించేట్లు చేస్తున్నది, అందటిచే నిత్యం ఆశ్రయింపబడుతున్నది, ముఖ్య ప్రయోజన రూపుడైన అయిన భగవానుని ఆశ్రయిస్తున్నది) అని,

**"శ్రయంతీం శ్రీయమాతాం చ శృణంతం శృణ్వతీమపి"**

(భగవానుని ఆశ్రయిస్తున్నది. ఇతరులచే ఆశ్రయింప బడుతున్నది, ఆశ్రితుల ప్రార్థనను వింటున్నది. పాపాలను పోగొడుతున్నది) (అహిర్బుధ్న్య సంహిత–21) అని దీని అర్థం చెప్పబడుతున్నది.

ఈ "శ్రీ" అనే నామం లక్ష్మికి గల అన్ని విధాలైన ఉత్కర్షలను తెలుపుతున్నదనే విషయాన్ని –

**"శ్రీ రిత్యేవ చ నామ తే భగవతి! బ్రూమ: కథ: త్వాం వయమ్"**

(పూజ్యురాలా! శ్రీ: అనేది నీ నామం. నిన్ను గూర్చి ఏమని పలుకగలం?) (చతు:శ్లోకి–1), **"శ్రీరసి యత:"** (ఎందువల్ల నీవు శ్రీ:– అని

అనబడుతున్నావో) (శ్రీగుణరత్నకోశం) అని గల వాక్యాలు తెలియజేస్తున్నాయి. **"భగవత్, నారాయణ"** అనే పదాల ద్వారా చెప్పబడిన అర్థాలకు లక్ష్మి అనురూపంగా ఉండే విషయం **"భగవతీం, శ్రియమ్"** అనే పదాల ద్వారా తెలుపబడింది. ఈ శ్రీశబ్దనిరుక్తులద్వారా ఆశ్రితుల దోషాలను పోగొట్టే స్వభావం, ప్రాప్యమైన ప్రయోజనంలో ఆశ, ప్రాపకమైన ఉపాయంలో నిశ్చయం మొదలైనవానిని అనుగ్రహించే స్వభావం, ఉపాయస్వరూపాన్ని పరిపూర్ణం చేసే స్వభావం, **"పితేవ త్వత్ప్రేయాన్"** (శ్రీగుణ–52) ఇత్యాది భట్టర్శ్లోకంలో చెప్పబడిన, భర్తకు (భగవానునకు) అనుగ్రహాన్ని కల్గించే స్వభావం సిద్ధిస్తున్నాయి.

**వ్యాఖ్యానం:–** ఏవ మాశ్రితార్థవ్యాపారా స్తదనుగుణా2 వతారాదయ శ్చ న కర్మకృతా ఇత్యాహ (దేవీమితి). భర్తు ర్లీలాయా మైకరస్యాత్తదనుగుణవిచిత్ర వ్యాపారోపపత్తి రితి భావః. "భగవతీ"మిత్యాది పదత్రయేణ ద్విషట్కార్ణస్థ భగవద్వాసుదేవపదార్థానురూప్యం చ జ్ఞాప్యతే. "దేవీ జుషతామ్", "శ్రీ ర్దేవీ పయస స్తస్మాదుస్థితా ధృతపఙ్కజా" ఇత్యాదయ శ్రుతిస్మృతయ స్స్వాచ్యన్తే. "శ్రియః శ్రీ శ్చ భవేదగ్ర్యా", ఇత్యాద్యుక్తపతిసమ్బన్ధన ద్యోతమానత్వాదిక మపి దేవీమిత్యనేన గమ్యతే.

**అనువాదం:–** ఈ విధంగా ఆశ్రితులకోసం చేసే ఈమె వ్యాపారాలు, దానికి తగిన ఈమె అవతారాలు మొదలైనవి కర్మవల్ల ఏర్పడినవి కావు– అని "దేవీమ్" అని అంటూ పల్కుతున్నారు– భర్త అయిన భగవానుని లీలలో ఐకరస్యాన్ని– సమమైన ప్రీతిని– కల్గినది. కనుక, లక్ష్మి దానికి తగిన వ్యాపారాలను చేయడం పొసగుతున్నది– అని తాత్పర్యం. "భగవతీమ్" అని ఆరంభించి, మూడు పదాలతో వాసుదేవ ద్వాదశాక్షరిమంత్రంలోగల భగవచ్ఛబ్దంలోని, "వాసుదేవ"

శబ్దంలోని అర్థాలకు అనుగుణంగా ఈమె ఉన్నదనే విషయం తెలుపబడుతున్నది. "శ్రియం, దేవీమ్" అనే రెండు పదాలను కలిపి అన్వయించడంవల్ల "శ్రియం దేవీ ముపహ్వయే శ్రీర్మా దేవీ జుషతామ్" (శ్రీసూక్తమ్) ("శ్రీ:" అని చ్పెబడే దేవిని నేను ఆహ్వానిస్తున్నాను. శ్రీ అని చెప్పబడే దేవి నన్ను చేరుగాక) అనే శ్రుతివాక్యం

**"శ్రీదేవీ పయస స్తస్మాత్ ఉత్థితా ధృతపంకజా"**

(విష్ణు–పు–1–9–100)

(లక్ష్మీదేవి ఆ పాలసముద్రంనుండి చేతిలో పద్మాన్ని ధరించినదై, వెలుపలకు వచ్చింది) ఇత్యాది పురాణవాక్యాలు జ్ఞాపకం చేయబడుతున్నాయి. "శ్రియ: శ్రీషశ్చ భవేదగ్ర్యా" (లఘుతంత్రమ్) (లక్ష్మికి ఉత్తమమైన సంపదగా భగవానుడు ఉన్నాడు) అని చెప్పబడిన భర్తయొక్క (భగవానునియొక్క) సంబంధంతో ప్రకాశిస్తూ ఉండే స్వభావం మొదలైనవి "దేవీమ్" అనే పదంతో వ్యక్తమవుతున్నాయి.

**వ్యాఖ్యానం:–** ఏవం "క్రీడార్థమవతీర్ణస్య తస్య" ఇత్యాద్యుక్త లోకా2. నుకమ్పాహేతుకావతారాయా అపి తస్యాః, "పశ్యతాం సర్వదేవానామ్", **"మయా వినా శుష్యతి శోకదీనమ్"** ఇత్యాదిభి రాగన్తుకసంశ్లేషవిశ్లేషాది వ్యపదేశాత్, కథ మపరాధ భీతానాం తత్తదవస్థాసు తత్పురస్కారేణ భగవదాశ్రయణం స్యా దిత్యత్రాహ (నిత్యానపాయినీమితి) **"శ్రీవత్సవక్షా నిత్యశ్రీః", "నిత్యైవైషా జగన్మాతా విష్ణోః శ్రీరనపాయినీ", "అన్యేషు చావతారేషు విష్ణో రేషా2నపాయినీ" "భగవద్వాసుదేవస్య నిత్యైవైషా2నపాయినీ"**, మహావిభూతే స్సమ్పూర్ణ షాడ్గుణ్యవపుష ప్రభోః, **"మమ నర్వాత్మభూతన్య నిత్యైవైషా2నపాయినీ"** ఇత్యాదిభి రనయో ర్న కదాచిదపి విశ్లేషః. అవతారేష్వపి కదాచిద్విశ్లేషశోకాదే రభినయమాత్ర మేవ. ఇదఞ్చ

శ్రీమద్రామాయణాన్తే సూచితమ్. "**రామస్య సవ్యపార్శ్వే తు పద్మాశ్రీ స్సమవస్థితా, దక్షిణే హ్రీ ర్విశాలాక్షీ వ్యవసాయ స్తథాఽగ్రతః**" ఇతి. ఏవం దేవీ మిత్యన్తేన వ్యాఖ్యేయస్థ శ్రీశబ్దార్థో దర్శితః. తన్ముఖేన నిత్యం భగవతస్సుఖ ప్రసాదనీయత్వం వ్యంయితుం "**నిత్యానపాయినీ**" మిత్యన్తేన తత్రత్య మతుబర్థ శ్చోక్తో భవతి.

**అనువాదం**:– ఈ విధంగా "**క్రీడార్థమవతీర్ణస్య**" (భారతమ్) (లీలకోసం అవతరించిన ఆ భగవానునకు సమానంగా లక్ష్మీదేవి అవతరిస్తుంది) ఇత్యాది వచనాలలో చెప్పబడిన, లోకాలను అనుగ్రహించడం కోసమే అవతరించే ఆమెకు భగవానునితో

**"పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలం హరేః"**

(విష్ణుపు–1–9–105)

(దేవతలందఱు చూస్తూ ఉండగా లక్ష్మీదేవి హరి వక్షస్సును చేరింది)

"**మయా వినా శుష్యతి శోకదీనమ్**" (రామా–సుందర–36–28) (నన్ను విశ్లేషించి, సీత దుఃఖంవల్ల దైన్యాన్ని పొందినదై ఎండి పోతుంది) ఇత్యాది వచనాలతో ఆగంతుకమైన సంశ్లేషం, విశేషం (కలయిక, ఎడబాటు) కల్గుతాయని చెప్పబడడంచేత, ఏ విధంగా భక్తులు ఆ యా అవస్థలలో ఆమెను ముందుంచుకొని భగవానుని ఆశ్రయించడానికి వీలవుతుంది? అని అంటే, "**నిత్యానపాయినీమ్**" అని అంటూ, దానికి బదులు పల్కుతున్నారు. "**శ్రీవత్సవక్షా: నిత్యశ్రీ:**" (రామా. యుద్ధ–114–15) (శ్రీవత్సమనే పుట్టుమచ్చను వక్ష స్థలంలో కల్గినవాడు, ఏ నాడు విశ్లేషించని లక్ష్మిని కలవాడు),

"**నిత్యైవైషా జగన్మాతా విష్ణోః శ్రీరనపాయినీ**" (విష్ణుపు–1–8–17) (లోకానికి తల్లి అయిన ఈ లక్ష్మి భగవానుని ఏనాడూ విడచి ఉండనిది)

**“అన్యేషు చావతారేషు విష్ణో రేషాఽనపాయినీ”**(విష్ణు.పు–1–9–144)

(మిగిలిన అవతారాలలో కూడా ఈమె విష్ణువును విడచి ఉండనిది),

**“భగవద్వాసుదేవస్య నిత్యైవైషాఽనపాయినీ” (పాంచరాత్రమ్)**

(భగవానుడైన వాసుదేవుని ఈమె ఏనాడూ విడచి ఉండనిది),

**“మహావిభూతే స్సంపూర్ణా షాడ్గుణ్యవపుష: ప్రభో:,**

**మమ సర్వాత్మభూతస్య నిత్యైవైషాఽనపాయినీ” (పాంచరాత్రమ్)**

(గొప్ప విభూతిని కలవాడను, సంపూర్ణమైన షాడ్గుణ్యాన్ని స్వరూపంగా కలవాడను, ప్రభువును, అన్ని వస్తువులకు అంతరాత్మ అయిన నన్ను ఈ లక్ష్మి ఏనాడూ విడచి ఉండదు) ఇత్యాది వచనాలతో ఈ ఇద్దఱికి ఏ నాడూ విశ్లేషం లేదు;

అవతారాలలో కూడా ఆ యా సమయాలలోని విశ్లేషం దుఃఖం, మొదలైనవి– అభినయించడం మాత్రమే– అని తెలుస్తున్నది. ఇది కూడా శ్రీమద్రామాయణం చివర,

**“రామస్య సవ్య పార్శ్వే తు పద్మా శ్రీ: సముపస్థితా,**

**దక్షిణే హ్రీ ర్విశాలాక్షీ వ్యవసాయ స్తథాఽ గ్రత:”**

**(రామా–ఉత్తర–109–6)**

(శ్రీరాముని ఎడమ వైపు పద్మా అనే పేరును కల లక్ష్మి ఉన్నది. కుడివైపు విశాలమైన నేత్రాలను గల భూదేవి ఉన్నది. ఆ విధంగానే, ముందు నీళారూపిణి అయిన వ్యవసాయం ఉన్నది) అని చూపబడింది. ఈ విధంగా **“దేవీమ్”** అనే పదం వరకు మూలంలో అంటే, ద్వయం లో ఉండే శ్రీః అనే పదం యొక్క అర్థం చూపబడింది. ఆమె మూలంగా ఎల్లప్పుడూ భగవానుడు సుఖంగా అనుగ్రహించగలిగినవాడు– అనేది తెలుపడం కోసం **“నిత్యానపాయినీమ్”** అనే పదంతో ఇక్కడ ద్వయంలో ఉండే మతుప్ ప్రత్యయంలోని ఆ అర్థం చూపబడింది.

**వ్యాఖ్యానం:–** నను, భగవతీ మిత్యాదిభి స్స్వతో నిర్దోషత్వాథౌ నిత్యసమ్బన్ధే చ సిద్ధే2పి, స్త్రీత్వోపాధివశాత్ కదాచిత్పతిపారార్థ్యవైముఖ్యమ్, పతిప్రతికూలాభిప్రాయత్వమ్, అవిమృశ్యకారిత్వం, నృశంసత్వం, నిగ్రహరుచిత్వఞ్చ. "**శతహ్రదానాం లోలత్వం మత్స్యానాం ప్రతికూలతామ్, గరుడానిలయో శ్శైఘ్ర్య మనుగచ్ఛన్తి యోషితః**", "**విద్యతే స్త్రీషు చాపల్యం కిం న కుర్వన్తి యోషితః**" ఇత్యాదిభిః ప్రసిద్ధమ్ యది స్యాత్, తదా కథం నిత్యమ శరణ్యాశరణ్యత్వం స్యాదిత్యత్రాహ– (నిరవద్యామితి).

సామాన్యత స్త్రీత్వనిబన్ధనదోషవచనం క్షేత్రజ్ఞేష్వేవ కర్మోపాధివిశేషనియతం ప్రాయికఞ్చేతి, నాస్యా స్తత్ప్రసఙ్గః. ఉక్తఞ్చ తథైవ, "**అనవద్యా 2నవద్యాంగీ నిత్యం తద్ధర్మధర్మిణీ**" ఇతి. శ్రీరామాయణే చ "**ఇయం తు భవతో భార్యా దోషై రేతై ర్వివర్జితా**" ఇతి, కిఞ్చ "అనృశంస్యం పరో ధర్మ స్త్వత్త ఏవ మయా శ్రుతః" ఇతి స్మారయన్త్యా నృశంసత్వప్రసంగ ఏవ నాస్తి, నిగ్రహరుచి శ్చ సమరర్థాయా ఏవాస్యా అత్యన్తాపకారిష్వపి న సమ్భవతీతి స్వవాక్యసిద్ధమ్, "**అసన్దేశాత్తు రామస్య తపస శ్చానుపాలనాత్, న త్వాం కుర్మి దశగ్రీవ! భస్మ భస్మార్హ తేజసా**" ఇతి.

ఏతద్విభూతిభూతదేవతాదిషు స్వకర్మవశాదీదృశదోష సమ్భవే2పి, నాస్యాః తన్మూలభూత సఙ్కల్పః, "**త్వయా దేవి పరిత్యక్తం సకలం భువనత్రయమ్, వినష్టప్రాయ మభవత్త్వయేదానీం సమేధితమ్, సంత్యక్తా యే త్వయా2మలే**" త్యాదిషూక్త సన్త్యాగో2ప్యుపేక్షామాత్రమ్. తచ్చ ప్రీతికోపవిరహేణావస్థానమ్.

**అనువాదం:–** అయితే, "**భగవతీమ్**" ఇత్యాది పదాలతో (లక్ష్మియొక్క) స్వభావంతోనే దోషాలు లేకుండా ఉండడం, ఎల్లప్పుడు కలసి ఉండడం, వ్యక్తమవుతున్నా, స్త్రీత్వమనే ఉపాధివశంచేత

**"శతహ్రదానాం లోలత్వం మత్స్యానాం ప్రతికూలతామ్,**
**గరుడానిలయో: శైఘ్ర్య మనుగచ్ఛంతి యోషిత:"**

**(రామా–ఆరణ్య–16–6)**

(మెఱుపుల చంచలస్వభావాన్ని, చేపల ప్రతికూలంగా సంచరించే స్వభావాన్ని, గరుడునకు, వాయువునకు గల వేగాన్ని స్త్రీలు పొందుతున్నారు),

**"విద్యతే స్త్రీషు చాపల్యమ్" (రామా–యుద్ధ–16–9)**

(స్త్రీలలో చాపల్యం ఉన్నది),

**"కిం న కుర్వంతి యోషిత:?"** (స్త్రీలు ఏ పని చేయరు?) ఇత్యాది వచనాలతో చెప్పబడిన, ఒక్కొక్క సమయంలో భర్తకు శేషంగా ఉండడంలో విముఖంగా ఉండడం, భర్తకు విరుద్ధమైన అభిప్రాయాన్ని కల్గి ఉండే స్వభావం, ఆలోచించకుండా కార్యం చేసే స్వభావం, క్రూరమైన స్వభావాన్ని, నిగ్రహించడంలో రుచిని కల్గి ఉండడం –అనే వానిని లక్ష్మి కల్గి ఉంటే, అపుడు అశరణ్యశరణ్యయై ఉండే స్వభావం ఆమెకు ఏ విధంగా ఉంటుంది? – అనే ఆక్షేపానికి **"నిరవద్యామ్"** అని అంటూ సమాధానం పల్కుతున్నారు.

సామాన్యంగా లోకంలోని స్త్రీకి చెప్పబడిన దోషాలు క్రితజ్ఞులైన స్త్రీలలోనే కర్మలనే కారణవిశేషం వల్ల ఉంటాయి. కనుక, అవి ప్రాయికాలు తప్ప సార్వత్రికాలు కావు. కర్మలనే ఉపాధివశంచేత జన్మించిన లోకంలోని స్త్రీలలో ఉండే ఈ దోషాలు కర్మసంబంధం లేని లక్ష్మిలో సంభవించవు. కనుక లక్ష్మీవిషయంలో ఆ దోషాలకు ప్రసక్తి లేదు. ఆ విధంగానే,

**"అనవద్యాऽనవద్యాంగీ నిత్యం తద్కర్మధర్మిణీ"**

**(లఘుతంత్రమ్–17–31)**

(దోషాలు లేని అంగాలను కల్గినది, నిత్యం ఆ భగవానుని స్వభావాలవంటి స్వభావాలను కల్గినది) అని దోషాలు లేనిదిగా లక్ష్మి చెప్పబడింది. శ్రీరామాయణంలో కూడా

**"ఇయం తు భవతో భార్యా దోషై రేతై ర్వివర్జితా"**

**(రామా–ఆరణ్య–10–7)**

(ఈ నీ భార్య సీత ఈ దోషాలను వేనినీ లేనిది) అని చెప్పబడింది. ఇంతేకాక,

**"ఆనృశంస్యం పరో ధర్మః తత్త్వ ఏవ మయా శ్రుత:"**

(శ్రీరామా సుందర–38–41)

(క్రూరస్వభావం లేకపోవడం– కరుణను కల్గి ఉండడం– గొప్ప ధర్మం అనేది నీవల్లనే విన్నాను) కూడా అని జ్ఞాపకం చేసే ఈమె క్రూరమైన స్వభావాన్ని కల్గినది– అని అనడానికి అవకాశమే లేదు.

శక్తిని కల్గినదై ఉన్నా, ఈమెపట్ల చాలా అపచారాలను చేసినవారి పట్ల కూడా శిక్షించాలనే అభిప్రాయం ఈమెకు లేదు– అనేది

**"అసందేశాత్తు రామస్య తపస శ్చానుపాలనాత్,**
**న త్వాం కుర్మి దశగ్రీవ! భస్మ భస్మార్హ తేజసా"**

(రామా– సుందర–22–20)

(శ్రీరాముని ఆజ్ఞ లేనందున, నేను పాతివ్రత్యమనే తపస్సును పాలిస్తున్నందున, రావణా! నిన్ను నేను, నా తేజస్సుతో భస్మం చేయగల్గినా, దహించడంలేదు) అని పలికే ఈమె వాక్యంవల్లనే తెలుస్తున్నది. ఈమెకు విభూతి అయిన దేవతల విషయంలో కర్మవశం వల్ల ఇటువంటి దోషాలు సంభవించినా, ఈమెకు ఆ కర్మకారణంగా కల్గిన నిగ్రహసంకల్పం లేదు.

**"త్వయా దేవి! పరిత్యక్తం సకలం భువనత్రయమ్,**
**వినష్టప్రాయ మభవత్, త్వయేదానీం మేధితమ్"**

(విష్ణు–పు–1–8–123)

(దేవీ! నీవు విడచిన ఈ ముల్లోకాలు అన్నీ పూర్వం నాశాన్ని పొందినవిగా అయినవి. ఇపుడు నీ కృపవల్ల వృద్ధి పొందాయి),

**"సంత్యక్తా యే త్వయా2మలే"** (విష్ణు పు–1–9–129)

(నిర్మల అయిన లక్ష్మీ! ఎవరు నీచే విడువబడ్డారో) ఇత్యాది వచనాలలో చెప్పబడిన సంత్యాగం అనేది ఉపేక్షించడం మాత్రమే. అది కూడా ప్రీతి, కోపం. రెండూ లేకుండా తటస్థంగా ఉండడమే.

**వ్యాఖ్యానం:–** నన్వేవం భగవదభిమతత్వాదికం, తచ్ఛరణ్యత్వోపయికం, సర్వం, తత్పత్న్యన్తరే2పి స్యాత్, **"విష్టంభో దివో ధరుణః పృథివ్యాః"** ఇత్యాదిభి స్తన్మాహాత్మ్య ప్రసిద్ధేః; తారతమ్యన్తు దురూహమ్; అతః కథమ్ అశరణ్యశరణ్యా మనన్యశరణ ఇత్యుచ్యతే? తత్రాహ (దేవదేవ దివ్యమహిషీమితి). యథా మనుష్యాదిభ్యో 2ధికానాం బ్రహ్మాదిదేవానాం మనుష్యస్థానీయానాం సర్వప్రకారసమధికతయా భగవాన్ దేవః, తథా బ్రహ్మాది దేవపత్నీభ్య స్సమధికానాం భగవత్పత్నీనా మప్యసౌ ప్రధానతమేత్యభిప్రాయేణ అత్ర దివ్యశబ్దః. ఇయం హ్యుభయాధిష్టానైకశేషిత్వసామ్రాజ్యేన, సర్వమంగళ ప్రదాయిత్వాదిభి శ్చ ప్రకృష్యత ఇతి భగవచ్ఛాస్త్రోక్తమ్, తథా బ్రహ్మాండపు రాణే2పి, **"అనన్త నామధేయా చ శక్తిచక్రస్యనాయికా"** ఇతి. పత్న్యాదిషు శక్తిశబ్ద స్తత్తద్విహారాదికార్యోపయుక్తవిశేషణత్వా 2భిప్రాయః. తదిదం ప్రాధాన్యం, **'కృతాభిషేకా మహిషీ'** తి విశేషణాన్మహిషీశబ్దేనైవ వివక్షితమ్. తదా దివ్యశబ్దసద్విగ్రహన్య భగవద్విగ్రహస్యైవాప్రాకృతత్వాదికం వ్యనక్తి.

ఏవం చికీర్షిత భఙ్గపరిహారాయ ప్రత్యాఖ్యానానర్హత్వాయచ పతివాల్లభ్యాతిశయ ఉక్తః.

అథ, తథావిధోత్కర్షస్వనికర్ష స్వాపరాధ దర్శనజనిత సాధ్వస పరిహారాయ ప్రజావాత్సల్యాతిశయ మాహ (అఖిలజగన్మాతరమితి). జగచ్ఛబ్ద ఇహ చేతనపరః. **"నమామి– సర్వలోకానాం జననీ మబ్ధిసమ్భవామ్", "త్వం**

**మాతా సర్వలోకానామ్**" ఇత్యాదిభి రస్యా శ్చతుర్ముఖాదీన్ సర్వజన్తూన్ ప్రతి మాతృత్వాల్లోకమాతేతి నామ పఠ్యతే. ఏవ ముపబృంహణబలాత్ "**నిజదేవీం మాతరమ్**" ఇత్యాదిషూక్త మస్యా మాతృత్వం భగవతః పితృత్వేన సమానవిషయమ్ న హి మదేకవర్ణమస్యా మాతృత్వమిత్యభి ప్రాయేణాఽఖిలశబ్దః.

తదిదం విశ్వమాతృత్వ ప్రదర్శితం నిరుపాధిక వాత్సల్యం రిపూణా మపి వత్సలస్య పత్యు రనురూపతమమ్. తచ్చ హితచిన్తారహితేఽ ష్వహితచిన్తకేష్వపి కయాచిన్నియత్యా కదాచిత్ఫలతి, కిమ్పున రిదానీం హితచిన్తోన్ముఖే మయీతి భావః. దుస్సహనిరస్తరాపరాధే దోషైకనిధా రావణేఽపి హి. సోన్మాదే పుత్ర ఇవ జననీత్వేనైవ జాతవాత్సల్యా, "**మిత్ర మౌపయికంకర్తుమ్**", "**విదిత స్స హి ధర్మజ్ఞః**" "**ప్రసాదయస్వ తం చైనమ్**" ఇత్యాదిభి స్సర్వాధికం రహస్య ముపదిశ్య తద్భ్రమప్రశమనే ప్రయతతే.

**అనువాదం:**– ఆ విధంగా అయితే, భగవానునకు ప్రియంగా ఉండడం మొదలైన శరణు పొందడానికి కారణాలైన అన్ని స్వభావాలు ఆ భగవానునకు తల మిగిలిన పద్మలకు కూడా ఉండవచ్చు కదా.

**"విష్టంభో దివో ధరుణః పృథివ్యా"**

(ఆకాశానికి ఆధారం ఎవరంటే. భూమిని ధరిస్తూ ఉన్నదే) అని మొదలైన వేదవాక్యాలలో వారి మహిమ ప్రసిద్ధమై ఉన్నది, కనుక, భగవానుని పత్నులలో తేడాను ఊహించలేము.

అందువల్ల, "**ఆశరణ్య శరణ్యామ్ అనన్య శరణః**" (ఏ శరణం లేనివారికి గొప్ప శరణమైన నిన్ను, వేరొక ఏ శరణం లేనివాడనై ఆశ్రయిస్తున్నాను) – అని ఏ విధంగా చెప్పబడుతున్నది? అనే అక్షేపానికి "**దేవదేవదివ్య మహిషీమ్**" అని అంటూ సమాధానాన్ని పలుకుతున్నారు.

మనుష్యులు మొదలైనవారి కంటే గొప్పవారు, భగవానుని పోలిస్తే మనుషులతో సమానంగా చెప్పదగినవారై ఉండే బ్రహ్మ మొదలైన దేవతల కంటే అన్ని స్వభావాలలోనూ గొప్పవారై ఉండే భగవానుడు ఏ విధంగా దేవదేవుడో, ఆ విధంగానే, బ్రహ్మ మొదలైన దేవతల పత్నుల కంటే గొప్పవారై ఉండే భగవంతుని పత్నులలో కూడా ఈమె ముఖ్యతమ– అనే అభిప్రాయంతో ఇక్కడ "**దివ్య**" అనే పదం చెప్పబడింది. ఈమె, ఇద్దరి వద్ద ఉండే ఏకశేషిత్వమనే సంబంధాన్ని కలిగి ఉన్నందువల్ల, అన్ని శుభాలను ఇచ్చే స్వభావం మొదలైనవాని వల్ల, మిగిలిన భగవంతుని పతత్నులు అందరి కంటే గొప్పది– అని పాంచరాత్రశాస్త్రంలో చెప్పబడింది.

ఆ విధంగానే, బ్రహ్మాండ పురాణంలో కూడా

**"అనంతనామధేయాశ చ శక్తిచక్రస్య నాయికా"**

(అంతు లేని నామాలను కలిగినద, శక్తీసమూహానికి నాయకురాలు) అని పత్నులందటిలో లక్ష్మి గొప్పది– అని చెప్పబడింది. ఇక్కడ పత్ని మొదలైనవానిలో శక్తి అనే పదం ఆ భగవానుని విహారాదిలీలాత్మకమైన కార్యాలను ఉపయోగించే విశేషణాలనే అభిప్రాయాన్ని కల్గినది. ఈ విధమైన లక్ష్మికి కల ప్రాధాన్యం. "**కృతాభిషేకా మహిషీ**" (అమరకోశం) (ప్రభువుతో కలిపి పట్టాభిషేకాన్ని చేయబడినది. స్త్రీ మహిషి అనబడుతుంది) అని విశేషించి పల్కిన "**మహిషీ**" శబ్దప్రయోగం ద్వారా చెప్పబడింది. అపుడు "**దివ్య**" అనే పదం ఆమె విగ్రహం భగవద్విగ్రహం వలె ప్రకృతిసంబంధ రహితమైనది– ఇత్యాది అంశాలను వ్యక్తం చేస్తున్నది.

ఈ విధంగా తాను చేయగోరిన కార్యానికి కలిగే విరోధాన్ని లేకుండా చేయడంకోసం, (ఈమె మాటను స్వామి) తిరస్కరించడానికి వీలు కాకుండా ఉండడంకోసం భర్త అయిన భగవానుని పట్ల ఈమెకు ఉండే వాల్లభ్యాతిశయం (ప్రేమాతిశయం) ఇంతవరకు చెప్పబడింది.

ఇకపై, అటువంటి ఆమె గొప్పతనాన్ని, (జీవుని) తన నైచ్యాన్ని, తన అపచారాలను గమనించడంవల్ల జీవునకు కలిగే భయాన్ని పోగొట్టడంకోసం తర సంతానరూపమైన ఆశ్రితులపట్ల ఈమెకు ఉండే గొప్ప వాత్సల్యాన్ని గూర్చి **"అఖిలజగన్మాతరమ్"** అని ప్రస్తావిస్తున్నారు. ఇక్కడ ప్రయోగింపబడిన జగచ్ఛబ్దం చేతనసాధారణపరం. (జీవులను అందటిని తెల్పుతుంది)

**"నమామి సర్వలోకానాం జననీ మబ్ధిసంభవామ్"** (విష్ణు.పు1-9-117)

(అన్ని లోకాలకు తల్లి. పాలసముద్రం నుండి పుట్టినది అయిన లక్ష్మిని సమస్కరిస్తున్నాను),

**"త్వం మాతా సర్వలోకానామ్"** (విష్ణు. పు. ) (నీవు అన్ని లోకాలకు తల్లివి) ఇత్యాదులలో సమస్తప్రాణులకు తల్లిగా ఉన్నందున **"లోకమాతా"** అని ఈమెకు పేరు పఠింపబడుతున్నది.

ఈ విధంగా ఉండే ఉపబృంహణవాక్యాల బలంవల్ల **"నిజదేవీమ్ మాతరమ్"** (శ్రీసూక్తమ్) (నాకు తల్లి అయిన లక్ష్మిని) ఇత్యాది శ్రుతివాక్యాదులలో చెప్పబడిన, ఈమె లోకానికి అంతటికి తల్లి అయిన స్థితి (మాతృత్వం) అనేది, భగవానుడు తండ్రిగా ఉండే స్వభావం (పితృత్వం) అనేది ఏ యే విషయాలనుబట్టి ఏర్పడినదో, ఆయా విషయాలనుబట్టే ఏర్పడింది. ఇటువంటి ఈమె మాతృత్వం లోకాలకు అన్నిటికి సంబంధించినది కనుక, అది నాకు ఒక్కనికి మాత్రం చెందకుండా ఉండదుకదా! అనే అభిప్రాయంతో ఇక్కడ 'అఖిల' శబ్ద ప్రయోగం చేయబడింది.

ఇటువంటి, ఈమెకు గల ఈ జగన్మాతృత్వం ద్వారా ప్రదర్శింపబడిన వాత్సల్యగుణం **"రిపూణా మపి వత్సల:"** (శ్రీరాముడు శత్రువులపట్ల కూడా వాత్సల్యాన్ని కలవాడు) (రామా) అనే భర్తకు చాలా అనురూపమైనది. అది కూడా, తమ హితాన్ని గూర్చిన ఆలోచన లేని, అహితాన్నిగూర్చి సదా

చింతించేవారి విషయంలో కూడా ఒక విధమైన అదృష్టంవల్ల ఒకానొకప్పుడు ఫలిస్తుంది. కనుక,

ఇక, ఇప్పుహితాన్నిగూర్చి చింతించే నా విషయంలో ఫలిస్తుందా? అని అడుగవలసిన పని లేదు– అని భావం.

సహించడానికి సాధ్యం కానివి, నిరంతరం చేయబడేవి అయిన అపరాధాలను కలవాడై, దోషాలకు ముఖ్యమైన ఆశ్రయమైనవాడైన రావణునిపట్ల కూడా, పిచ్చిపట్టిన బిడ్డ విషయంలోవలె, మాతృత్వంవల్లనే వాత్సల్యాన్ని కల్గినదై, "**మిత్ర మౌ పయికం కర్తుమ్**" (రామా– సుందర–21–19) (రాముని నీవు మిత్రునిగా చేసికోవడం తగినది) అని,

**"విదిత స్స హి ధర్మజ్ఞ: శరణాగతవత్సల:,**
**తేన మైత్రీ భవతు తే" (రామా–సుందర–21–20)**

(ఆ శ్రీరాముడు శరణాగతులపట్ల వాత్సల్యాన్ని కలవాడుగా, ధర్మజ్ఞుడుగా ప్రసిద్ధుడు కదా! అతనితో నీకు స్నేహం కలగాలి) అని, "ప్రసాదయస్వ తం చైనమ్" (రామా–సుంద–21–20) (నీవు ఈ శ్రీరాముని ప్రసన్నునిగా చేసికో) అని మొదలైన వాక్యాలతో సర్వాధికమైన (అన్నిటి కంటే గొప్పదైన) రహస్యాన్ని ఉపదేశించి, అతనికి గల భ్రమను పోగొట్టం కోసం సీతాదేవి ప్రయత్నం చేసింది.

**వ్యాఖ్యానం:–** ఏవ మఖిలజగన్మాతర మిత్యాది పదై శ్చికీర్షితాయా స్తత్ప్రపత్తేషరతిశయితా ఽమోఘధర్మత్వం సూచితమ్. యథోక్తం కాశ్యపీయే, "**నారాయణాత్మికాం దేవీం శ్రియం త్రైలోక్యమాతరమ్, భజమానో మహాభాగ పరమో ధర్మ ఉచ్యతే**" ఇతి. అయం చ తదాత్మకత్వ వ్యపదేశః తత్ప్రీత్యా ఽభిప్రాయేణ.

అత్ర అస్మత్స్వామిన్నితివద స్మన్మాతర మిత్యపి శ్రీవిష్ణుచిత్తాదయః పఠన్తి. వ్యాచక్షతే చ యామునమునివంశజననేన పున శ్చ విశేషేణా 2 స్మన్మాతర మితీతి. ఉక్తై స్స్వభావై స్సిద్ధ మపేక్షితా2నుగుణమాకార మాహ (ఆశరణ్యశరణ్యా మితి). యేషాం మోక్షోపాయనిష్పత్తి కామానాం సర్వలోకశరణ్యో2పి న భవేచ్ఛరణ్యః, తేషా మప్యసౌశరణ్యా. యథోక్తమ్ త్రిజటయా, **"భర్త్సితా మపి యాచధ్వం రాక్షస్యఃకింవివక్షయా, రాఘవాద్ధి భయం ఘోరం రాక్షసానా ముపస్థితమ్, ప్రణిపాత ప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా, అల మేషా పరిత్రాతుం రాక్షస్యో మహతో భయాత్"** ఇతి. వానరపరిషది చైతదనువదన్వాయుసూను రేవ మాహ– **"అలమేషా పరిత్రాతుం రాఘవా ద్రాక్షసీగణమ్, తత స్సా హ్రీమతీ బాలా భర్తు ర్విజయహర్షితా, అవోచద్యది తత్ సత్యం భవేయం శరణం హి వః"** ఇతి. **"పాపానాం వా శుభానాం వా"** ఇత్యాదీని చ ప్రభంజనసుతం ప్రతి తద్వాక్యాని. కుపితనరసింహసమీపా గతిభీతా శ్చ ప్రజాపతి ప్రభృతాయ స్తా మేవ విశ్వమాతర మాశ్రిత్య, తత్పురస్కారేణ తముపసేదు రితి పురాణ ప్రసిద్దమ్. ఆహు శ్చ **"మాత ర్మైథిలి! రాక్షసీ స్త్వయి తథైవా 2 ర్ద్రాపరాధా స్త్వయా రక్షంన్త్యా"** ఇత్యాది.

**అనువాదం:–** ఈ రీతిలో **"అఖిలజగన్మాతరమ్"** అనే పర్యంతం గల పదాలతో శ్రీరామానుజులు, తాము చేయగోరిన లక్ష్మీప్రపత్తి చాలా ఆమోఘమైన స్వభావాన్ని కల్గినదని సూచించారు. ఆ విధంగానే కాశ్యపీయసంహితలో కూడా,

> **"నారాయణాత్మికాం దేవీం శ్రియం త్రైలోక్యమాతరమ్,**
> **భజమానో మహాభాగ పరమో ధర్మ ఉచ్యతే"**

(మహానుభావా! నారాయణస్వరూపిణి. ముల్లోకాలకు తల్లి అయిన లక్ష్మీదేవిని భజించడమనేది గొప్ప ధర్మంగా చెప్పబడుతున్నది) అని చెప్పబడింది. ఇక్కడ "**నారాయణాత్మికామ్**" అని. పలడం ఆ నారాయణుని పత్ని అనే అభిప్రాయంతోనే, ఇక్కడ "**అస్మత్ స్వామిన్!**" అనేవిధంగా "**అస్మన్మాతరమ్**" అని ప్రయోగింపబడిందని ఎజ్ఞళాళ్వాన్ మొదలైనవారు అన్నారు. ఆళవందార్ వంశంలో జన్మించినందున తిరిగి విశేషించి "**అస్మన్మాతరమ్**" అని చెప్పబడిందని కూడా వ్యాఖ్యానించారు.

పూర్వం తెల్పిన స్వభావాలవల్ల ఏర్పడినది, తమ ఇష్టానికి అనురూపమైనది అయిన లక్ష్మియొక్క ఆకారాన్ని పల్కుతున్నారు. "**అశరణ్యాశరణ్యామ్**" అని అంటూ మోక్షోపాయం సిద్ధించాలని కోరుకొనేవారికి సర్వలోక శరణ్యుడైన భగవానుడ కూడా శరణం కానపుడు, వారికి కూడా ఈ లక్ష్మి శరణు పొందదగినదిగా ఉన్నది. శ్రీరామాయణంలో త్రిజట

**"భర్త్సితా మపి యాచధ్వం రాక్షస్య: కిం వివక్షయా?,**
**రాఘవాద్ధి భయం ఘోరం రాక్షసానా ముపస్థితమ్,**
**ప్రణిపాత ప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా,**
**అల మేషా పరిత్రాతుం రాక్షస్యో మహతో భయాత్"**

(రామా–సుందర–27–57)

(రాక్షస స్త్రీలలారా! మనచే బెదరింపబడినది అయినా ఈ సీతను ప్రార్థించండి. ఇంకా ఏదో చెప్పాలనే ఆశ ఎందుకు? ఎందువల్ల అంటే, రామునివల్ల రాక్షసులకు చాలా భయంకరమైన భయం ఏర్పడబోతున్నది. జనకుని కుమార్తె అయిన మైథిలి శరణాగతి చేస్తే అనుగ్రహించే స్వభావాన్ని కల్గినది కదా. రాక్షసస్త్రీలకు రాబోయే గొప్పభయం నుండి ఈమె రక్షించగల్గినది) అని చెప్పబడింది.

వానరుల సభలో ఈ మాటను అనువదిస్తూ హనుమంతుడు

**"అల మేషా పరిత్రాతుం రాఘవాత్ రాక్షసీగణమ్...**
**తత స్సా హ్రీమతీ బాలా భర్తు ర్విజయ హర్షితా,**
**అవోచద్యది తత్ సత్యం భవేయం శరణం హి వః"**

(రామా–సుందర–58–93)

(రాముని బారినుండి రాక్షసీగణాన్ని రక్షించడానికి ఈ సీతాదేవి శక్తి కల్గినది– అని త్రిజట పల్కింది. అప్పుడు ఆ సీత, సిగ్గును కల్గినదై, భర్త అయిన శ్రీరాముని విజయంతో సంతోషాన్ని పొందినదై, "శ్రీరామవిజయం అనేది నిజమైతే మీకు నేను శరణం కాగలను" అని పల్కింది) అని అన్నాడు.

**"పాపానాం వా శుభానాం వా వధారాణాం ప్లవంగమ!,**
**కార్యం కరుణమార్యేణ న కశ్చిన్నాపరాధ్యతి"** (రామా–119–44)

(హనుమా! పాపంచే చేసిన వారి విషయంలో అయినా, పుణ్యం చేసినవారి విషయంలో అయినా, వధార్హుల విషయంలో అయినా గొప్పవాడు కరుణను చూపాలి. లోకంలో తప్పు చేయనివాడెవడు?) ఇత్యాదులు హనుమంతునితో సీత పల్కిన వచనాలు.

మిక్కిలి కోపాన్ని పొందిన నృసింహస్వామి సమీపానికి వెళ్ళడానికి భయపడిన బ్రహ్మాదిదేవతలు జగన్మాత అయిన లక్ష్మీదేవిని ముందుంచుకొని, ఆ స్వామి దరిచేరారు– అనేది పురాణ ప్రసిద్ధం.

**"మాత ర్మైథిలి! రాక్షసీ స్త్వయి తథైవార్ద్రాపరాధా స్త్వయా**
**రక్షంత్యా పవనాత్మజా ల్లఘుతరం రామస్య గోష్ఠీ కృతా"**

(శ్రీగుణరత్న–50)

(తల్లీ! మైథిలీ! నావట పూర్వంవలె క్రూరమైన అపరాధాలను చేసే రాక్షసస్త్రీలను హనుమంతుని బారినుండి రక్షించే నీచే రాముని గోష్ఠి

తక్కువగా చేయబడింది) అని పరాశరభట్టర్ కూడా అన్నారు.

**వ్యాఖ్యానం:–** భవత్వేవ మశరణ్యశరణ్యత్వం తస్యాః, భవత స్తేన–కిమాయాత మిత్యత్ర, తదేకప్రపత్తియోగ్యాం స్వావస్థాం దర్శయతి (అనన్యశరణఇతి). అన్యచ్ఛరణం యస్య నాస్తి సోఽ నన్యశరణః, శరణమ్ – ఉపాయః. "**ఉపాయే గృహరక్షిత్రో శ్శబ్ద శ్శరణ మిత్యయమ్, వర్తతే సాంప్రతం చైష ఉపాయార్థైకవాచకః**" ఇతి వ్యవస్థాపనాత్; ఏవ ముత్తరత్రాపి ద్రష్టవ్యమ్. ఉత్తమపురుషేణైవ స్వాన్వయేసిద్ధే, అహ మిత్యధికోక్త్యా, స్వస్య చ దుష్కరోపాయాన్తరాశక్తి స్సూచ్యతే, "ప్రపద్యే" ఇత్యత్ర యద్యపి గత్యర్థేన ధాతునా బుద్ధ్యర్థేన సతా అధ్యవసాయమాత్ర ముపస్థాప్యతే, తథాపి, ప్రమాణానుసారాత్ శరణశబ్దతాత్పర్యాచ్చ, ప్రార్థనాద్యన్విత భరన్యాసం కరోమీ త్యుక్తమ్భవతి. ప్రార్థ్యతే చానన్తరం ఫలవిశేషః. యస్తు పరస్పరోపకారేణ దక్షిణాదానేన ప్రశాసనేన వా భరన్యాసః, నాసౌ ప్రపత్తి.

నన్విదం ముముక్షోరేవ, భగవద్వ్యవచ్ఛేదేన తదన్యప్రపదనం తదైకాన్త్యం విహన్యాత్, మైవమ్, యథా కర్మయోగాదిక మనన్యోపాసనార్థ–తయోపాదీయతే, తథాఽనన్యప్రపదనార్థతయపాదీయమాన మిదం తద్వదైకాన్త్యమేవ స్థాపయితి. యథా చ స్వాధికారోచితపరివారార్చనే అనన్యత్వావిరోధః, తథేహాపి. "**ఆప్తో విష్ణో రనాప్త శ్చ ద్విధా పరికర స్స్మృతః, నిత్యో వన్ద్యో న చానిత్యః కర్మవశ్యో ముముక్షుభిః**" ఇతి చోక్తమ్. ఏవం ఘటకతయా వరణేఽపి న విరోధః, అన్యథా గురుభజన తత్పురస్కారాదికమపి విరుధ్యేత.

**అనువాదం:–** లక్ష్మీదేవికి పూర్వం తెల్పిన రీతిలో అశరణ్యశరణ్యత్వమనేది ఉంటే ఉండనివ్వండి. దానివల్ల మీకేమి లాభం? అనే ప్రశ్నకు, ఆమెను

మాత్రమే శరణాగతి చేయవలసిన తమ దశను గూర్చి "అనన్యశరణః" అని పల్కుతున్నారు. వేరొక ఏ శరణం లేనివాడు అనన్యశరణుడనబడతాడు.

శరణమంటే ఉపాయం

**"ఉపాయే గృహరక్షిత్రోః శబ్ద శరణమిత్యయమ్,**

**వర్గతే సాంప్రతం చైష ఉపాయార్థైకవాచకః"**

(శరణమనే ఈ శబ్దం ఉం గృహం, రక్షకుడనే అర్థాలను తెల్పుతుంది. ఇది ప్రకృతంలో ఉపాయాన్ని మాత్రం తెలియజేసేదై ఉన్నది) (అహిర్బుధ్న్య సం–36–44) అని దీని అర్థం నిర్ణయింపబడింది, కనుక, ప్రకృతంలో ఈ శబ్దం ఉపాయవాచకం. ఈ రీతిలోనే తరువాత కూడా శరణశబ్దార్థాన్ని గ్రహించాలి.

"ప్రపద్యే" అనే ఉత్తమపురుషక్రియారూపంద్వారా అహమనే అర్థం సిద్ధిస్తూ ఉండగా, **"అహమ్"** అని అధికంగా వల్కినందున, తాము దుష్కరాలైన ఉపాయాంతరాల అనుష్ఠానంలో శక్తి లేనివారమనే అర్థం సూచింపబడింది "ప్రపద్యే" అనేచోట **"పద్–గతౌ"** అనే గత్యర్థకధాతువుద్వారా **"గత్యరాః బుద్ధ్యర్థాః"** అనే న్యాయంలో బుద్ధ్యర్థం తెలుపబడుతుంది కనుక, దాని ద్వారా అధ్యవసాయం మాత్రం తెలుపబడుతున్నా, ప్రమాణాలను అనుసరించి శరణమనే పదం యొక్క తాత్పర్యంవల్ల, ప్రార్థనతోకూడిన భరన్యాసానాన్ని చేస్తున్నాను– అని కూడా తెలుపబడుతున్నది.

తరువాత విశేషమైన ఫలంకూడా **"పారమార్థిక"** ఇత్యాదిగా ప్రార్థింపబడుతున్నది. పరస్పరం ఉపకారం చేసికోవడం ద్వారా, దక్షిణ మొదలైనవానిని ఇవ్వడం ద్వారా, ఆజ్ఞాపించడం ద్వారా ఎటువంటి కార్యంలో భరన్యాసం చేయబడుతున్నదో, అది ప్రపత్తి కాదు.

అయితే, మోక్షంలో ఆశ కల్గినవాడే భగవానుని కాదని, అతనికంటే వేఱయిన లక్ష్మి వద్ద ప్రపత్తి చేస్తే, అతని ఐకాంత్యానికి (భగవానుని మాత్రమే ప్రపత్తి చేయడమనే స్థితికి) భంగం కల్గుతుంది కదా! – అని అంటే, ఆ విధంగా భావించరాదు. భగవానునిపట్ల అనన్యమైన ఉపాసననం సిద్ధించడంకోసం కర్మయోగం మొదలైనవి ఏ విధంగా చేయబడుతున్నాయో. ఆ విధంగానే భగవానుని మాత్రమే ఆశ్రయించడమనే అనన్య ప్రపత్తికోసంగా గ్రహింపబడే ఈ లక్ష్మీప్రపత్తి కర్మయోగాదులవలె భగవదైకాంత్యాన్నే స్థాపిస్తుంది. ఏ విధంగా తన అధికారానికి తగిన భగవత్పరిజనాలను ఆరాధించినా, అది భగవానుని పట్ల అనన్యభక్తిని కల్గి ఉండడంలో విరోధం ఉండదో, ఆవిధంగానే ఇక్కడ కూడా లక్ష్మీప్రపత్తిని చేసినా, అది భగవదనన్య భక్తిని కల్గి ఉండడంలో విరోధం కాబోదు.

**“ఆప్తో విష్ణో రనాప్త శ్చ ద్విధా పరికరః స్మృతః,**
**నిత్యో వంద్యో న చానిత్య: కర్మవశ్యో ముముక్షుభి:”**

(పౌష్కరసంహిత)

(విష్ణువుయొక్క పరిజనం ఆప్తులని, ఆనాప్తులని రెండు రీతులుగా చెప్పబడింది. మోక్షంలో ఆశను కలవారిచే నిత్యులైన, ఆప్తులైన పరిజనం సేవించదగినది. కర్మకు వశుడైన అనిత్యుడు వందనీయుడు కాడు) అని చెప్పబడింది. ఈ విధంగా లక్ష్మీదేవిని ఘటకరూపంలో (పురుషకార స్వరూపిణిగా) వరించడంలో విరోధం లేదు. ఈ రీతిలో గ్రహించకపోతే గురువులను ఆరాధించడం, వారిని సత్కరించడం మొదలైనవి విరుద్ధాలే కాగలవు.

**వ్యాఖ్యానం:–** అథ, **“తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛేత్”, “ఆచార్య ముపాసీత”** ఇత్యాదిభి స్తాదర్థ్యాత్తత్సంగృహ్యతే, ఇయ మపి పూర్వోక్తైః

స్తథైవావిశేషాత్. కిఞ్చ శ్రియఃప్రపత్తిమ్, "**చన్ద్రాం ప్రభాసామ్**" ఇతి మంత్రేణాలక్ష్మీ నాశనార్థ మామనన్తి. తథా "**ఋచ స్సామాని యజూంషి, సా హి శ్రీ రమృతా సతామ్**" ఇతి. యా ముముక్షుణాం మోక్ష హేతు ర్విద్యైవ లక్ష్మీః, తదభావనాశో2 నయా క్రియత ఇతి తదర్థం శరణ్యాభిప్రాయసంవాదినీ తన్మహిషీప్రపత్తి ర్యుక్తేవేతి సిద్ధమ్.

ఏవం సేయం సాక్షాత్పరంపరయా వా సర్వఫలసాధికా. 'ఉదారా' మితి శ్రౌతం పదం హ్యానవచ్ఛిన్నవిషయమ్, తచ్చ, "**సర్వకామప్రదాం రమ్యాం సంసారార్ణవతారిణీమ్, క్షిప్రప్రసాదినీం దేవీం శరణ్యా మనుచిన్తయేత్**" ఇత్యాదిభి స్స్వాయమ్భువాదివచనై రుపబృంహితమ్. వ్యాచఖ్యు శ్చ "**ఐశ్వర్య మక్షరగతిం పరమం పదంవా**" ఇత్యారభ్య, "**కథయ కో2యు ముదారభావః**" ఇతి. వ్యతిరేకముఖేన చైతత్ స్థిరీకృతం చతుఃశ్లోక్యామ్ – "**శ్రేయో న హ్యారవిన్దలోచన మనఃకాన్తా ప్రసాదాదృతే, సంసృత్యక్షర వైష్ణవాధ్వసు నృణాం సమ్భావ్యతే కర్హిచిత్**" ఇతి.

**అనువాదం:**– ఇక, "**తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్**" (ముండక-1-2) (ఆ పరమాత్మను తెలిసికోవడంకోసం ముముక్షువు గురువు వద్దకు వెళ్ళాలి), "**ఆచార్య ముపాసీత**" (ఆపస్తంబ-1-1-6) (ఆచార్యుని ఉపాసించాలి) ఇత్యాది శ్రుతివాక్యాదులచే ఆ భగవానుని గూర్చిన జ్ఞానంకోసం ఆచార్యోపాసమనేది ఏర్పడి (చెప్పబడి) నందున, ఆ ఆచార్యోపాసనం అంగీకరించ బడుతున్నది– అని అంటే, ఈ లక్ష్మీప్రపత్తికూడా పూర్వం పల్కిన వచనాలవల్ల, ఆ విధంగానే, భగవానునిగూర్చిన జ్ఞానంకోసం విధింపబడినందున, ఈ రెండిటిమధ్య– ఆచార్యోపాసనం, లక్ష్మీ ఉపాయం అనే ఈ రెండిటి మధ్య –ఏ భేదం లేదు. ఇంతేకాక, లక్ష్మీయొక్క "**చంద్రాం ప్రభాసామ్**" (శ్రీసూక్తం) (చంద్రునివలె

ప్రకాశించేది, కాంతిని కల్గినది) అనే మంత్రంతో లక్ష్మీరాహిత్యం లేకుండాపోకడం కోసంగా– అని పల్కుతున్నారు. ఆ విధంగా,

**"ఋచ స్సామాని యజుషః హి శ్రీ రమృతా సతామ్"**

**(యజు–అష్టక–3–7)**

(ఋగ్వేదం. సామవేదం, యజుర్వేదం – అనే ఇవి సత్పురుషులకు నశించని లక్ష్మి) అనే వాక్యంలో మోక్షంలో ఆశ కలవారికి మోక్షానికి కారణమైన విద్యయే అని ఏర్పడుతున్నందున, అటువంటి అలక్ష్మియొక్క నాశం లక్ష్మీప్రపత్తిక చేయ (సాధించ) బడుతున్నది.

అందుచేత, దానికోసం శరణ్యుడైన భగవానుని అభిప్రాయాన్ని అనుసరించే ఆ భగవత్పత్ని అయిన లక్ష్మీవద్ద ప్రపత్తి చేయడం కూడా ఉచితమేనని ఏర్పడుతున్నది. ఈ విధంగా ఈ లక్ష్మి నేరుగానో, లేక పరంపరగానో అన్ని ఫలాలలను ఇవ్వగల్గినది.

"**ఉదారామ్**" అనే శ్రీసూక్తవాక్యాలలో పల్కిన పదం అన్ని విషయాలకు చెందినది. (పరిమితమైన ఫలాలకు మాత్రమే చెందినది కాదు) అదికూడా,

**"సర్వకామప్రదాం రమ్యాం సంసారార్ణవతారిణీమ్,**
**క్షిప్రప్రసాదినీం లక్ష్మీం శరణ్యా మనుచింతయేత్"**

(స్వాయం భూవచనం)

(అన్ని కోరికలను ఇచ్చేది, అందమైనది, సంసారమనే సముద్రాన్ని దాటించేది, శీఘ్రంగా అనుగ్రహించేది అయిన లక్ష్మిని ఆశ్రయించదగినదిగా భావించాలి) ఇత్యాది స్వయంభువు మొదలైనవారి వచనాలచేత వివరింపబడింది.

"**ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా**" (శ్రీగుణరత్న–58) ఇహలోకైశ్వర్యాన్ని, కైవల్యాన్ని, పరమపదమనే పరమపురుషార్థాన్ని భక్తులక

ఇచ్చినా) అని ఆరంభించి, "**కథయ కోఽయు ముదార భావః**" (అమ్మా! ఏమి నీ ఈ ఔదార్యం! అది ఎంత గొప్పదో తెలియజేయి) అని పరాశరభట్టర్ అన్నారు. చతుఃశ్లోకిలో ఈ అర్థం వ్యతిరేకముఖంగా–

"**శ్రేయో న హ్యరవిందలోచనమనః కాంతా ప్రసాదాదృతే సంస్మృత్యక్షరవైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కతర్హిచిత్**"

(పుండరీకాక్షునకు ప్రియురాలైన లక్ష్మీయొక్క అనుగ్రహం లేకపోతే సంసారంలో కాని, కైవల్యంలో కాని, పరమపదంలో కాని జీవులకు ఏరకంగాను ఏనాడూ శ్రేయస్సు కలుగదు కదా!) అని స్థిరీకరింపబడింది కూడా.

★★★★★★★

శరణాగతిగద్యలో అంతర్గతమైన లక్ష్మీగద్యకు శ్రీవేదాంతదేశికులు
అనుగ్రహించిన సంస్కృత భాష్యానికి ఆంధ్రానువాదం పరిసమాప్తం.,
ఎంబెరుమానార్ తిరువడిగళే శరణమ్

